డాక్టరు యస్వి. జోగారావు.
ఆంధ్రవిశ్వకళాపరిషత్తు–వాల్తేరు.

# ప్రస్తావన

అద్యతనాంధ్ర సాహితీ మహోద్యానమున నొక హృదయ షట్పది గ్రాహకుణి మా వెంకటసుబ్బయ్య. యువకుడైనను హృదయ పరిపాకము గల దొడ్డ వ్యక్తి. రసవశంవదమైన ఆ హృదయమునుండి, కళాకౌశల పేశలమైన రుచిరాభిరుచి నుండి మధురాశయ మాధ్వీకోశముగా బాహిరిల్లినదే యీ విమర్శ నిబంధము.

అతని ప్రతిభకు ప్రభకట్టి నట్లిందలి వ్యాసము లితఃపూర్వము పత్రికాముఖమున ప్రకటితములై అతనిని లబ్ధ ప్రతిష్ఠుని గావించినవే. ఆరు వ్యాసములును సారస్వతసౌరభవమును గుబాళించునట్టివే. ఇందు మహాకావ్యము, ఖండకావ్యము, పదకవిత, అవధానకవిత, గోష్ఠికవిత్వము– వివిధ కవితా వైఖరులను గురించిన విదగ్ధ దర్శన మున్నది. ప్రత్న సాహిత్య ప్రణిధానముతోపాటు నూత్న కావ్యానుశీలన ప్రయత్నమున్నది.

తెలుగు పొలమున ...ష్ఠులు తమ సాహిత్య సంప్రదాయములను విస్మరించుచున్న యీ కాలమున, సాహిత్య విమర్శ పెడదారులు పట్టుచున్న విక్కాలమున నిక్కముగ నిట్టి వ్యాససంపుటముల అక్కఱ ఎంతో యున్నది. ఇది వేంకటసుబ్బయ్యగారి సంపుటములలో రెండవది. వ్యాస లో శిల్ప ...స్తుడాయన. ఒక ఉత్తమ సాహిత్యవిమర్శకుని కుండవలసిన ము? సదసద్వివేకము, వ్యాసకర్తకు వలసిన విషయ వాకము కలిసి పరిణత ప్రజ్ఞకు వేసిన రాచబాట లీ వ్యాసములు.

ఇక ప్రత్యేకముగా చెప్పవలసిన దొకమాటగలదు. తెలుగున పద్య రచనలో రౌచికరాజమార్గమున స్వారిచేసిన రౌతు లెందరో గలరు. కాని గద్య రచనలో అపేలవమైన లాలిత్యముతో, కటుత్వములేని పటుత్వముతో శయ్యావైయాత్యము ప్రదర్శించిన విదగ్ధు లెందరో లేరు. వారిలో—మన సారస్వత విమర్శకులలో విశిష్టులం దొకరు మా వేంకటసుబ్బయ్య.

అతనికి మనసార నా మంగళాశాసనములు.

# స్వాగతము

జీవితమును ఒక లలితకళగా చూచినపుడు కలిగిన అనుభూతి నా ప్రథమకృతి - వ్యాసమంజరి. సాహిత్యజీవితమును ఒక సుందరో ద్యానముగ సందర్శించినపుడు రూపుదాల్చిన రసాకృతి-ఈ షట్పది.

వ్యాసమంజరిని అనుశీలించి వాత్సల్యముతో ఆదరించిన మధు రసార్ద్రహృదయులు, కర్ణాటాంధ్రసాహితీసవ్యసాచులు- ఆచార్య కె. సుబ్బరామప్పగారు.

వ్యాసమంజరిని తిలకించి, పులకించి ఈ ప్రచురణకు ప్రోత్సహిం చిన సహృదయ సుహృన్మణులు-శ్రీ తాండ్ర రామకృష్ణయ్యగారు.

షట్పదిలోని వ్యాసములను ఆంధ్రప్రభ-కళాసాహిత్య విజ్ఞాన వేదికపై నిలిపి రసజ్ఞపాఠకులకు పరిచయము చేసిన సంపాదక ప్రియ మహోదయులు శ్రీ నీలంరాజు వెంకట శేషయ్యగారు.

సరస కవితా కళాకౌశలము. కవిత్వతత్త్వవిమర్శనా పాటవము, స్వచ్ఛతాసాంద్రమైన స్నేహశీలము సమమైన పాళ్ళలో గలిసిన అను భావముతో-గురువర్యులుగా మేధను, మిత్రవర్యులుగా హృదయమును గుర్తెరిగి ఈ రచనకు "ప్రస్తావన" కూర్చినవారు డా. యస్వీ. జోగారావు గారు.

వారలకు నా నమోవాకములు.

సహృదయ పాఠకులకు సుహృదభివందనలు.

అప్పజోడు వేంకట సుబ్బయ్య.

యేషాం కావ్యానుశీలన వశా ద్విశదీభూతే మనో ముకురే
వర్ణనీయ విషయ తన్మయీభవన యోగ్యతా
తే హృదయ సంవాద భాజః సహృదయాః ·



# భువన విజయము

ఒక్కసారి శ్రీకాకుళము మొదలు చిత్తూరు వరకును అనంతపురము మొదలు ఆదిలాబాదు వరకును భావనా ప్రపంచమున పర్యటించిన తెలుగు బాటసారికి తరతరాల తెలుగు చరిత్ర తలపు రాకపోదు. తెరలు తెరలుగా తలపువచ్చే ఆ తెలుగు చరిత్రలో భారతీయ పరమధర్మ ప్రతిష్ఠాపకుడు, సాహితీసమరాంగణసార్వభౌముడు, అఖండ ఆంధ్ర సామ్రాజ్య నిర్మాత అయిన శ్రీకృష్ణరాయల స్వర్ణయుగము ప్రత్యక్షమగుసరికి ఆ బాటసారి నిలువెల్ల పులకించి విరయబూచిన సంపంగి చెట్టువలె నిలువకపోడు. కటకము మొదలు కన్యాకుమారి వరకు విరాజిల్లిన ఆ విజయ స్తంభాలు, తుంగభద్రా తరంగాలలో తళతళలాడిన ఆ విఠ్ఠలాలయ గోపురాల దీప్తులు ఆకాశమందలి మెఱుపుతీగల మించి వెలిగిన ఆంధ్రవీరుల ఖడ్గకాంతులు, సహృదయ లోకమునకు సుధాధారలనె పానీయములుగా పెదవికందించిన భువనవిజయ కవితాగోష్ఠులు, తలచి తలచి తెలుగువాడు తన్మయుడగుట తప్పదు. విలయశీలమైన కాలము, విజృంభించివచ్చిన విరోధిసైన్యము ఆ విజయ స్తంభముల విరుగగొట్టిన కొట్టెనేమోగాని, ఆ విఠ్ఠలాలయ వైభవాలను వినాశనము చేసిన చేసెనేమోగాని, ఆంధ్రవీరుల ఖడ్గకాంతుల అంత మొనర్చిన ఒనర్చెనేమోగాని ఆ భువనవిజయ కీర్తి చంద్రికల మాపలేక పో

భువనవిజయమను పేరు వినగనే అపజయమెట్టిదో యెరుగనట్టి ఒకనాటి ఆంధ్రజాతి అ పేరు పెట్టుటలో ప్రదర్శించిన ఔచిత్యము, అభిరుచి ఆ పదమునందు ప్రతిఫలించును. కాగా రాయలు ప్రపంచమున తనసేనచే రాజకీయముగ సాధించిన విజయము. సాహితీ ప్రపంచమున ఆ సదస్సుచే సాధింప దలచిన విజయము ఆ పదమునందు ప్రతిధ్వనించును. అందుచేత భువనవిజయపదము ఉభయతారకము. భూమిని ఎనిమిది దిక్కులందు ఎనిమిది ఏనుగులు భరించినట్లే ఈ సాహితీ సదస్సు అష్ట దిగ్గజములమీద ఆధారపడి యున్నదను అభిప్రాయమున కనుగుణముగ, అధికారికముగ పరిగణన పొందిన ఎనిమిది కవితా పీఠములు కల్పించి, ఉత్తమకవులుగ గణుతికెక్కిన ఎనమండుగురనందు ప్రతిష్ఠించుట జరిగినది. అట్లని అష్ట దిగ్గజములు తప్ప ఆంధ్రభోజుని ఆస్థానమున కవులుండరని అనుకొనుట అపోహ కాగలదు. వందలకొలది విద్వాంసులు, లెక్కకు మిక్కిలిగ కవులు ఆ మహాసభనలంకరించియుందురు.

భువనవిజయము, అది ఒక సాహితీ సరోవరము! అందలి అష్టదిగ్గజములు విరియబూచి పరిమళము విరజిమ్ము పద్మములు. అష్ట దిగ్గజముల మధ్యనున్న కృష్ణరాయలు ఆ రాజీవముల నడుమనున్న రాజహంస. ఈ మనోహర దృశ్యము జగత్తులో సాహిత్యమున్నంతకాలము నేత్రపర్వముగ నిలిచియుండగలదు.

భువనవిజయసభాపతి కృష్ణరాయలు. అతని వ్యక్తిత్వములోని మొదటి విశేషము పరాక్రమము. పరాక్రమమునకు రూపకల్పనయే కృష్ణ రాయ లనిపించును. ఈ సత్యమును లెస్సగా గుర్తించిన మంత్రిసత్తముడు తిమ్మరుసు. ఆ మేధావి కృష్ణరాయలలో మహాంధ్ర సామ్రాజ్య చక్రవర్తి చిహ్నములు చిరుతప్రాయముననే చూడగలిగినాడు. విద్యాత ` మి

హైందవ సంస్కృతిని సముద్ధరించు దృష్టితో భావించిన పొలిమేరలను తిమ్మరుసు మంత్రి రాజకీయముగ తీర్చిదిద్దుటకు స్థిరసంకల్పుడై నాడు. అందుల కవసరమైనవి రెండు. ఒకటి, బుద్ధిబలమూ – బృహస్పతిని మించగల బుద్ధిబలము. రెండు, బాహుబలము – యమునిగూడ బెదిరింపగల బాహుబలము. అట్టి బుద్ధిబలము తనకు గలదన్న ఆత్మవిశ్వాసముతో– అంతటి బాహుబలము కృష్ణరాయలకున్న దన్న నమ్మకముతో ప్రభు ద్రోహము సేసియైన తిమ్మరుసు కృష్ణరాయలను బ్రతికించినాడు. అతనిని తన సంకల్పమున కనుగుణముగ తీర్చిదిద్దినాడు. కావున కృష్ణరాయల వ్యక్తిత్వములో ఆ మహామంత్రినిగూడ ఆకర్షించిన మొదటిగుణము పరాక్రమము.

ఆ పురుషపుంగవుడైన కృష్ణరాయలలో పరాక్రమమునకుదోడు కళాభిరుచి కూడియుండుట ఆంధ్రజాతి చేసికొన్న అదృష్టము. ఏ కళా ఖండములోని వెలుగుచూచినను అతని హృదయము సూర్యోదయమున కొక్కటొక్కటిగ రేకులువిప్పుకొని వికసించి స్పందించి మరందబిందువుల స్రవించునట్టి పద్మకోరకమునకు ప్రతిబింబమగును. అట్టిది అతని సహృదయత. కృష్ణరాయల అభిరుచి ఏ వ్యక్తికైనను ఆదర్శప్రాయమే. ఒక్కొక్క కవిలోగల కవితామాధుర్యమును తుమ్మెదవలె చక్కగా గ్రోలి తన్మయత నొందగల తత్వ మాతనిది. అతడు సాహితీషట్పది. అంతేగాక తన భుజపరాక్రమముచే విజయపరంపరను సాధించి అఖండ ఆంధ్ర సామ్రాజ్యాధిపతిగ అర్హతను స్థిరపరచుకొన్న కృష్ణరాయలు, కవితాకళను వలచి ఉపాసించి ఆముక్తమాల్యదను రచించి ఆంధ్రజాతి కందించి భువనవిజయ సభాపతిగ నుండ నర్హతను సాధించినాడు. సాహితీ సమరాంగణ సార్వభౌముడను మాట సత్యమనిపించుకొన్నాడు. బహుశః ప్ర నుక కృష్ణరాయలను భువనవిజయ సభాపతిగ నిలిపిరన్నమాట

ఆంధ్రజాతినోటపడుట కాతని అంతరంగ మంగీకరించియుండదు. అందుచే ప్రతిభకు పదును పెట్టుకొనుటకు, వ్యుత్పత్తిని వృద్ధిచేసికొనుటకు, సహృదయతను సువిశాలము చేసికొనుటకు బహుకార్యమగ్నుడైన కృష్ణరాయలు అమూల్యమైన అతని కాలమును కొంత వినియోగించి కృషిచేసియుండును. ఆముక్తమాల్యదలోని వర్ణనలు ఈ విషయమునకు విస్పష్ట సాక్ష్యములు.

సాహితీప్రపంచమున సహనము శక్తిసంపన్నతకు సూచిక. సంస్కృతికి జీవనాడి. సహృదయతకు పునాది. ద్వేషము, కోపము, మాత్సర్యము – మొదలగునవన్నియు బలహీనతకు చిహ్నములే. కొన్ని యెడల ప్రత్యక్ష చిహ్నములు. మరికొన్నియెడల పరోక్షచిహ్నములు. కృష్ణరాయ లెంత శక్తిమంతుడో అంత సహనవంతుడు. తాను వైష్ణవుడై యుండి ధూర్జటికవీంద్రుని శైవమును సహించినాడు. అష్టదిగ్గజములలో నొకనిగా అతనిని సత్కరించినాడు. ధూర్జటి నిరంకుశత్వమును నిరసించుకొనక అతని కవితామాధురిని కొనియాడినాడు. అప్పుడప్పుడు మీద బడిన రామకృష్ణుని పలుకుములుకులకు మెచ్చుకొనెనేగాని నొచ్చుకొనలేదు. అద్వితీయమైన అతని రసజ్ఞతకు కొలతబద్దవంటి తిమ్మనపద్య మిట తెలుపదగినది.

ప్రతి వర్ష వసంతోత్సవ
కుతుకాగత సుకవి నికర గుంఫితకావ్య
స్మృతి రోమాంచ విశంకిత
చతురాంతః పురవధూప్రసాదనరసికా.

కవిత[illegible]న్న రాయ లెంతపులకించెనో ఈ కందమున కన్పించగలదు. రాయలలోని [illegible] విశేషములకుదోడు అతని హృదయమందలి అంతస్స్రవంతి వైష్ణవ[illegible]క్తి. ఏ భక్తియైనను వ్యక్తి ప్రకృతికి పవిత్రతను గూర్చును. అన్ని విశేషమ[illegible]ంతో గూడియున్న రాయలవ్యక్తిత్వమున కీ భక్తి[illegible] [illegible]ము

వంటిది. అందుచేత ఇట్టి సభాపతి ఏ సాహితీ సభకైన, ఎప్పుడైన అటం ప్రాయుడే.

కృష్ణరాయల తరువాత కవులనుగూర్చి కొన్ని మాటలు చెప్పవచ్చును. పెద్దన అష్టదిగ్గజములలో అన్ని విధముల పెద్దవాడు. అతని పెద్దరికమునకు కేవలము కవితమాత్రమే కారణముగాదు. మనుచరిత్రలోని ప్రవరునిబట్టి చూచిన పెద్దన స్ఫురద్రూపియనిపించును. "హితుడవు చతురవచోనిధివ"ను వాక్యమునుబట్టి ఆతడు సంభాషణ చతురుడని స్ఫురించును సంభాషణచతురుడు సదస్సును జయించగలడు. సంభాషణచాతురి ముందు సామర్థ్యమాగలేదు. పెద్దన మండలాధిపతిగ నుండె ననుటనుబట్టి ఆతడు కేవలము సాహితీరంగమున శోభిల్లుటయేగాక రాజకీయరంగమున గూడ ప్రవేశమున్నవాడై రాయల కాంతరంగికుడుగ నుండె ననిపించును. ఏవంవిధ విశేషములచే పెద్దన కా భువనవిజయమున ప్రత్యేకగౌరవము లభించినది. పెద్దన తరువాత పేరొందదగినవాడు దూర్జటి. ఈతడు కేవలము కవితచేతను అనుభావముచేతను రాజును మెప్పించి కొలువు కూటమున కాలు బెట్టిన కవి. కృష్ణరాయల సార్వభౌమత్వమునుజూచి గాని సాహితీపోషకత్వమును జూచిగాని తనశైవమును చల్లబరచుకొని మొగమోటమునకైన వైష్ణవముతో సంధిచేసికొననివ్యక్తి. అతి స్వతంత్రమైన ప్రకృతి, అచంచలమైన శివభక్తి ఈతని ఆత్మీయతకు జీవనాడులు. ఇక తిమ్మన. అటు మహారాణికి ఇటు మహారాజునకు కావలసినవాడు. అరణపుకవి. ఇతడు మృదుస్వభావునివలె గన్పించును. ఎదుటి హృదయము గాయపడకుండ చెడ్డను చెప్పునపుడుగూడ ముద్దుముద్దుగా చెప్పగలిగిన దీతని మృదుస్వభావము. పైగ వయస్సున పెద్దవాడు. అట్టి స్వభావము గలవారు ఆవేదన పడువారి ననునయించుటకు అద్భుతముగ ఉపకరింతురు. ప్రపంచమున ఏ కొలదిమందికో ఇట్టి ప్రత్యేకమైన ప్రజ్ఞయుండును.

...ందుచేతనే తిరుమలదేవి తల్లిదండ్రులు లీతనిని అరుణపు కవిగ అంపిరేమొ. అయ్యలరాజురామభద్రుడుగూడ ఒక దిగ్గజముగ ఆ సభాస్థాన మలంకరించినాడు. మిగత కవులు నలువు రెవరన్నది పలువాదములకు మూలమైన విషయము. ఒక కవిపేరు చెప్పి ఈతడట నుండెననువారు కొందరు. కాలవిపర్యాసమునో, ఇతర కారణములనో చూపి కాదనువారు మరికొందరు. కాని ప్రచారమున నున్న కథలను, ప్రదర్శింపబడిన వాదములను తరచి చూడ తెనాలిరామకృష్ణకవి ఆ కాలమున యువకుడై ఆ సాహితీ సభకు వచ్చిపోవుచుండెనేమొ యను సంశయము గలుగును. ఆ చిరుతప్రాయమున నాతనికి దిగ్గజగౌరవము లభించియుండదేమొ కాని ఆతని చురుకుదనము-మెరుపువంటి మేధాశక్తి, కమ్మని కవితాధార పెద్దనాది మహాకవులను, సభాపతియగు కృష్ణరాయలను చక్కగా ఆకర్షించియుండును. చిరుతప్రాయమున నున్నవాడును, చురుకుదనము గలవాడును అగుటచే పది చమత్కారముల నా సభాపతిమీద విసరివేసినను లేక పెద్దనాదికవుల మీద పడవేసినను రసికావతంసులైన వారు మురిసియుందురేగాని మొగము ముడిచియుండరు. ఆ పెద్దలచే పది విసుగులు విసిరించుకొన్నను వికటకవి వానికి వినోదించియుండును. కాని ఆ భువనవిజయసభ్యులందరు ఆ యువకునికి ఉజ్జ్వల భవిష్యత్తు గలదని భావించియుండుటచేతనే ఆతని కొంటెతనమును సహించి ప్రక్కకు గెంటివేయకుండిరేమొ. వారి భావన సత్యమని భవిష్యత్తు నిరూపించినది. రామకృష్ణుడు పరిణత ప్రజ్ఞుడై పాండురంగమహాత్మ్యమును పలికినాడు. మిగత దిగ్గజములుగ కన్నడ సంస్కృత తమిళ కవులుండుటయు అసంభవముకానేరదు.

ఆస్థానమున మంత్రులన్న నుందురుగాక, దండనాథులున్న నుందురుగాక, సామంతులున్న నుందురుగాక, కాని కవివర్యుడు లేనిదే తమ కొలువు

కూటమునకు పరిపూర్ణత గలుగుట అసంభవమని ఆనాటి ప్రభువులు నమ్మినారు. అందుచేతనే రాజులు ఏరికోరి కవుల రప్పించు కొని కొలువు కూటములలో నిలుపుకొన్నారు. ఆనాడు కవి ఆస్థానమున అపరిహార్యమైన భాగమైనాడు. కవులు నిత్యజీవితావసరములనేగాక వారు జీవితములో అనుభవింపదలచిన భోగముల నన్నింటిని కవిత్వభాషలో ఉత్ప్రేక్షలు అతిశయోక్తులు గుప్పించి అడిగినప్పటికిని ఆనాటి రాజులు "అక్షరములా" అవి తీర్చినారు. కవికి అవసరమైన ఒక ప్రశాంతత లభించినది. కవి తన జీవితమును కవిత కర్పించినాడు.

ఈ ఘట్టమున భువన విజయ కార్యక్రమమునుగూర్చి ప్రస్తావించుట సమంజసమే. కాని అందుల కూహయే ఆధారము. ఇందలి విషయములు సత్యమునకెంత సన్నిహితములాయని చూడదగినవేగాని అచ్చపు సత్యములాయని అడుగకూడనివి.

సమస్యకు చమత్కారము జీవము. విరోధాభాసముగూడ దానికొక విశిష్టలక్షణము. చమత్కారము శోభిల్లునట్లు, వైరుధ్యము విరిగిపోవునట్లు, సదస్యులహృదయముల నూపునట్లు సమస్యలు పూరింపవలసియుండును. అందుచే నాటినుండి నేటివరకు సమస్య సమర్థతకు గీటురాయిగను, సదస్సునకు సంతర్పణముగను శోభిల్లుచున్నది. సామాన్యముగ భువనవిజయమునగూడ సమస్యాపూరణ మొకభాగమైయుండును. సాహితీ సమరాంగణ సార్వభౌముడుగాని, అతని అభీష్టము ననుసరించి అమాత్య శేఖరుడు తిమ్మరుసుగాని ప్రతిపాదించిన సమస్యలను అష్టదిగ్గజములు తమ అద్వితీయ ప్రతిభను ప్రదర్శించి పూరించియుందురు. అప్పుడప్పుడు ప్రకరణౌచిత్యము గలిగి ప్రజల నెక్కువ ఆకర్షించు సమస్యలా సదస్సున ప్రతిపాదింపబడుచుండె నని జనశ్రుతివలన విదితమగును. "కుంజర

యూథమ్మ్ దోమకుత్తుక జొచ్చెన్"-అనునది అట్టివానిలో చెప్పదగినది. రామకృష్ణుని పూరణలోని ప్రతిభ చూచి పెద్దనాది మహాకవులుగూడ పెద్దగా కరతాళధ్వనులు చేసియుందురు. రామకృష్ణుని గేలిచేయవలెనని ప్రతిపాదింపబడిన "రవిగాంచనిచో కవి గాంచునేగదా" అను సమస్యగూడ అట్టివానిలో నొకటి. ఏ ధూర్జటివంటి మహాకవియో లేచి,

ఆ రవి వీరభద్రు చరణాహతి డుల్లిన బోసి నోటికిన్
నేరడు రామకృష్ణకవి నేరిచెటో మన ముక్కుతిమ్మరాట్
క్రూర పదాహతిం దెగిన కొక్కెరి పంటికి దుప్పి కొమ్ము ప
ల్గా రచియింప నౌర! రవి గాంచనిచో కవిగాంచునే గదా.

అని పూరించును. ఇది వినగనే తిమ్మనగారి కాలితాపును, రామ కృష్ణుని చిలిపిచేష్టను గ్రహించి సదస్యులు హర్షధ్వానములు చేసియుం దురు. ఆ కాలితాపుమీది కాలక్షేపములో పారిజాతకావ్యము ప్రస్తావనకు రాకపోదు. పండితులు సత్యభామ పాదతాడనలోని ఔచిత్యమునుగూర్చి పరిశీలించునపుడు తిమ్మరుసుమంత్రి తప్పకుండ తిమ్మన అభిప్రాయ మడుగ గలడు. తిమ్మన లేచి "జలజాతాసన వాసవాది ......." అను పద్యమును జదివి, అది తప్పు గాదని కేవలము తొలగద్రోయుట యని, సమర్థించి, తన పద్యమును తిమ్మరుసు సదిమందిలోనికి లాగె నన్న చురుకు తగిలి 'మా సత్యభామ చెయిద మొక సుకుమారప్రక్రియ, ఒక సుందరచికిత్స. దాని కా విధముగ విపరీతార్థాలు తీయగూడదని' హెచ్చ రించగలవాడే. ఇక తిమ్మరుసు తనమీది మాటలు సమర్థించుకొనక తప్పదు. 'ఆ అర్థాల లోతులు మా కంతగా తెలియవు గాని మీ కావ్యం ప్రపంచంలో తెచ్చిన పరిణామం మాత్రం బాగా కనిపిస్తూనే ఉంది. ఈ మధ్య అభినవకృష్ణుల మని అనుకునే నవయువకులు భయంతో

ప్రేయసి పాదాల కడ నిలవడం మాని ఎందుకైనా మంచిదని తలగడపై పే ధైర్యంగా నిలబడుతున్నారని విన్నాను.'—అని హర్షధ్వానాల మధ్య ఆగి ఆగి అనకపోడు.

భువనవిజయ కార్యక్రమములో కావ్యపరిచయ మొక భాగ మన వచ్చును. అష్టదిగ్గజములు, అప్పుడప్పుడు కృష్ణరాయలు, ఒక్కొక్కప్పుడు ఎక్కడినుండియో వచ్చిన క్రొత్తకవి. తమ రచనలను సభకు పరిచయముచేసి సభాసదులు సేయు గుణదోషవిమర్శను సహృదయతతో స్వీకరించి యుందురు. పండితుల శాస్త్రచర్చలుగూడ అటు చోటు చేసికొనును. ఒక్క ఉదాహరణ. కృష్ణరాయలను కావ్యము చదువుడని అష్టదిగ్గజము లడుగుట సహజమే. రాయలు తన విష్ణుచిత్తుని అతిథిసేవ విశిష్టమని తెలుపుచు—

ఆ నిష్ఠానిధి గేహ సీమ నడురే యాలించిన న్నోమ్రయు నెం
తే నాగేంద్రశయాను పుణ్యకథలుం దివ్యప్రబంధాను సం
ధానధ్వానము నాస్తి శాకబహుతా నాస్త్యుష్ణతా నాస్త్యపూ
పో నాస్త్యోదన సౌష్ఠవంచ కృపయా భోక్తవ్యమ న్మాటలున్.

—అని ఎలుగెత్తి చదివియుండును. ఏ పండితుడో లేచి తెలుగు పద్యమున కేవల సంస్కృత వాక్యములు సార్వభౌములు చొప్పించిరే యని వ్యంగ్యముగ వెలితి సూచింపక మానడు. ఏ పెద్దనవంటివాడో లేచి "అనుకృతేఽస్తి వాక్యంతు" అను సూత్రబలమున పై వాక్యముల కనుకరణ మున్నదని సమర్థించును. ప్రభువులవారి అభిప్రాయ మిట ప్రధాన మని ఏ అయ్యలరాజో అనకపోడు. రాయలు, "ఆ వాక్య ప్రయోగమున నొక ప్రత్యేకత యున్నది. చారచర్య రాజనీతిలో భాగమని మీ రెరుగు

దురు. నేను స్వయముగ మారువేషమున దేశప్రజల జీవిత విశేషములు పరిశీలించు ప్రకృతి గలవాడ నగుట గూడ ప్రజకు తెలియును. ఒకనాడు అర్ధరాత్రివేళ .నేను, అప్పాజీ చారులవేషమున సంచరించుచు నన్నని వాన జల్లునకు తలదాచు కొనవలెనని ఒక యింటి గోడ ప్రక్కన ఒదిగి నిలిచితిమి. లోపలినుండి పురుషోత్తముని పుణ్యకథాలాపములు, ద్రావిడ ప్రబంధ పారాయణధ్వానములు వీనుల విందుగా వినిపించినవి. అది వైష్ణవ కుటుంబమని ఊహించితిమి. అర్ధరాత్రివేళ ఆ భక్తి తత్పరత నన్ను పరవశుని జేసినది. అంతేగాదు. కొంతసేపటికి బహుశః అతిథులుగ వచ్చిన పరదేశి వైష్ణవుల కేమొ భోజనము పెట్టుచు -"నా స్తిశాకబహుతా నాస్త్యుష్ణతా నాస్త్యపూపో నాస్త్యోదన సౌష్ఠవంచ కృపయా భోక్తవ్యమ్" అని గృహస్థు పలుకు మాటలు చెవిని బడినవి. నా రాజ్యమున అర్ధరాత్రి వేళ అతిథి వచ్చుట యేమి! అంత ఆర్ద్రమైన ఆతిథ్యమేమి! అని నిలువెల్ల పులకించినాను. తన్మయుడనైనాను. ధన్యుడ ననుకొన్నాను. ఒక్క పరుగున వెళ్ళి ఆ విష్ణుభక్తుని కౌగిలించు కొనవలె ననిపించినది. కాని అప్పాజీ ఔచిత్యము పాటింపుమని ఆపినారు. ఆ సన్నివేశము నా స్మృతిలో చిరంజీవము. నేను జీవితమున పులకించిన ఆ ఘట్టము నా ఆముక్తమాల్యదలో విష్ణుచిత్తుని ఆతిథ్యవర్ణనలో వెల్లివిరిసినది. ఆనాడు ఆ గృహస్థుని యింటికి పరదేశివైష్ణవులు వచ్చినట్లున్నారు. వారికి దేశభాష తెలియదు గదా. అందువలన సర్వపండిత వేద్యమైన సంస్కృత భాషలో అతిథిపూజాతత్పరు డా వాక్యముల నివేదించినాడు. నన్ను తన్మయుని జేసిన ఆ వాక్యములు వ్యాకరణదృష్టితో గాక వాస్తవికదృష్టితో యథాతథముగ వ్రాయబడినవి. అవి బుద్ధిపూర్వకములే" — అని హర్ష ధ్వానముల మధ్య చెప్పగలడు. అంత మాత్రమున రామకృష్ణు డూరకుండునా! "అహమదీనాం ద్విత్వ" మను సూత్రమును బట్టి భోక్తవ్య మను చోట ద్విత్వంబు రావలయును గదా యని అనక మానడు. శబ్దానా

మ_స్య భాగేషు యోఽనుస్వారః. ప్రదృశ్యతే, తస్యాచి పరతో మస్వా్య త్సర్వత్ర కవి సమ్మతేః' పదేషు తద్య దాద్యంతే వా ద్విత్వం హరి సమ్మతేః' అను అధర్వణాచార్యుల వాక్యముల వలన ద్విత్వాభావమై అను స్వారమునకు మకారము వచ్చెనని ఏ అప్పలాచార్యులో ప్రభువుల ప్రయోగమును సమర్థించ గలడు. రామకృష్ణుడు చివాలున లేచి చేతులు జోడించి 'అప్పలాచార్య సన్నిధౌ అపశబ్ద భయం నాస్తి - ఇక కానీయండి కవులు'- అనుచు కూర్చొనకపోడు. ఆతని ఎత్తిపొడుపునకు ఎవ్వరు గొల్లుమనరు; అది యొక రసప్రపంచమై రాణించియుండును. కాగా చిన్న, పెద్ద అను భేదము లేక ఛలోక్తులు గూడ ఆనాడు సభలో చోటు చేసుకొని యుండును. ఒకనాడు సభ కాలస్యముగ వచ్చు రామకృష్ణుని జూచి కృష్ణరాయలు "కవి వృషభులు మహా ఉత్సాహంతో వస్తున్నారే, కారణమేమొ, శాద్వలశ్యామలమైన తివాసీ సిద్ధంగా ఉంది" - అని అన్నాడట. అందుకు రామకృష్ణుడు "కామధేనువువంటి ప్రభువు లున్నపుడు కవి వృషభుల ఉత్సాహమున కే" మని వచ్చి కూర్చున్నాడట. మరొక ప్రభువైనచో ఆ మాటకు ఓకటకవి తల తీయించి యుండెడి వాడే. కాని రసికసమ్రాట్టు రాయ లొక్క చిరునవ్వుతో ఆ ఛలోక్తిని సత్కరించినాడు. ఇట్లు భువనవిజయ విశేషముల నెన్నియైన చెప్ప వచ్చును. ఆనాటి కార్యక్రమాలు అక్షరరూపమును దాల్చకుండుట ఆంధ్రజాతి దురదృష్టము.

భువనవిజయమున కవికి జరిగిన విశేషసత్కారములు విశ్వ సాహిత్య చరిత్రకే వన్నె బెట్టు నట్టివి. ఉదయగిరి దుర్గాధిపతి యగు ప్రహరేశ్వరుని కిరీటమును కాలదన్నినట్టియు, గండరగండ, మూరు రాయరగండ బిరుదములు వహించినట్టియు, అఖిలాంధ్ర సామ్రాజ్య మహానాయకుడుగా కీర్తింపబడినట్టియు కృష్ణరాయ లీ భువనవిజయ

సభాముఖముననే పెద్దన కాలికి కవిగండపెండేరమును స్వహస్తములతో నలంకరించినాడు. అంతేగాక మనుచరిత్ర కృతి నందుకొనునపుడు పెద్దనను పల్లకిలో కూర్చుండబెట్టి పుర మేగ మోసినాడు. రాజలాంఛనములతో మదకరీంద్రము మీద విజయనగర పురవీధులలో పోవుచు పెద్దనకవీంద్రు డెదురుపడినచో మత్తేభమును డిగ్గి కేలూత యొసగి ఆ కవి నెక్కించుకొన్నాడు. ఎంత మర్యాద ! ఇట్టి సత్కారములలో సార్వభౌముడు కవిని జాతికి నాయకునిగ నిలుపుట కన్పించ గలదు. ఇక రాయ లిచ్చిన అగ్రహారాది దానముల కవధి యుండునా ! ఆ యుగమున కవి గాని వాడే దురదృష్టవంతుడు.

భువనవిజయ సభాపతి విషయ మటుండ సదస్సు నందలి సహృదయుల సంగతి గూడ విచారింపదగినదే. ఆనాటి సదస్యులు సంస్కారమున్నవారు. విశేషించి రసజ్ఞులు. కవితాకళను వలచి గొప్పగా గౌరవించినవారు. ఆనాడు "దేశభాషలందు తెలుగు లెస్స" యను ప్రభుప్రబోధము ప్రతి వ్యక్తి హృదయమందును ప్రతిధ్వనించినది. తెలుగు కవిత సదస్యుల జీవితములో నొక భాగముగ పరిణమించినది. తన యెదుట నున్న ఆనాటి భువనవిజయ సభాసదుల నుద్దేశించియే పెద్దన "ఒప్పు తప్పరయు రసజ్ఞు లూహ తెలియం గల లేఖక పాఠకోత్తముల్" అనిపలికె నేమొ. జనశ్రుతిలోనున్న ఒక కథ ఆనాటి ప్రజల కవితారక్తిని ప్రదర్శించగలదు. రాయలు యతి వేషమును దాల్చి శిష్యవేషమును ధరించిన చెలికానితో గజపతి యంతఃపురమున ప్రవేశించెనట. కొంతవడికా విజయమును వాసనబట్టి గజపతి అన్న యతివేషమున నున్న వ్యక్తి నిజస్వరూపమును పరీక్షింప దలచి యొక పన్నాగము పన్నినాడు. యతీంద్రులు శిష్యసమేతముగ వెలికి వచ్చుట కొక్క ద్వారమును మాత్రమే తెరచియుంచి ఆ ద్వారమున కడ్డముగ నొక సామాన్య సైనికుని కాలు బిగదన్ని

కూర్చుండ నియమించినాడు. సర్వసంగ పరిత్యాగియైన యతి ఆ సైనికుని కాలిక్రిందుగ దూరిపోవుటకు సంకోచింపడు. లేక మహావీరుడైన రాయలైనచో వెనుకంజ వేయగలడని ఆతడు పొంచియుండెను. రాయలు ద్వారమును చేరబోయి ఆ దృశ్యమును చూచి ఆగినాడు. కర్తవ్యమేమి? ప్రక్కనున్న శిష్యుని చెవిలో ఏదో చెప్పినాడు. శిష్యుడా సైనికుని సమక్షమున నిలిచి యెలుగెత్తి స్తుతిరూపమున నొక తెలుగు పద్యమును అద్భుతముగ చదివినాడు. ఆ పద్యమును విని సైనికుడు తన్మయుడై తల యూపుచు దిగివచ్చి మహాకవులకు నమోవాకములని మోకరిల్లి నాడట. ఈమధ్య కృష్ణరాయలు గడప దాటినాడు. ఏ వ్యక్తియో, అందును సైనికుడు – కవితకు కనుచూపు మేరలో నుండనివాడు – పన్నాగము భంగమైనను, పద్యమును విని పరవశుడై కవికి ప్రణమిల్లుటలో ఆనాటి ఆంధ్రజాతి కవితా కళకు కర్పూరనీరాజన మెత్తుట కానవగును. అట్టిది తెలుగు పద్య ప్రభావము. అట్టిది కవికి గల గౌరవము. ఈ కథలోని వాస్తవికత యెట్లున్నను ఆనాటి సదస్యుల సహృదయత అంత ఉన్నతమైనదని ఊహింపవచ్చును.

భువనవిజయమును నిఖుపుకొన్న ఆంధ్రజాతి రసజ్ఞత స్మరింప దగినది. ఆంధ్రజాతి కవి కాలికి గండపెండేరము తొడిగినట్టిది. కవులు కూర్చుండ ప్రభువులే పల్లకి మోసినట్టిది. కవులకే గాక కవపుత్రులకు గూడ కనకాభిషేకములు చేసినట్టిది. అట్టిది మన జాతి రసజ్ఞత. ఏదేని ప్రపంచపరిషత్తు జరిగినచో రాజకీయముగ మనకు స్థానము లేకున్న లేకుండుగాక. ఆర్థికముగ మనకు ఆసనము లేకున్న లేకుండుగాక. బల సంపదలో మనకు పీఠము లేకున్న లేకుండుగాక – కాని సరస సాహితీ క్షేత్రమందలి సహృదయుడుగ మా సింహాసన మేదని ఆంధ్రుడైనవాడచటి కేగి గుండెమీద చేయివేసి గద్దించి అడుగవచ్చును.

*

# ఖడ్గతిక్కన

ఆంధ్రదేశమున వీరరసము కరుడు గట్టిన కుటుంబములలో ఖడ్గ తిక్కన దొకటి. రణరంగమున మరణించియైన వంశప్రతిష్ఠ పోషింపు మను తండ్రి. పసుపు కుంకుమ పోయినను వీరపత్ని యను పేరు నిలుపు మను భార్య. కొడుకు గతించినను వీరమాత యను కీర్తి కావలెనను తల్లి; ఆ కుటుంబము నలంకరించిన ఆదర్శమూర్తులు.

తిక్కన జీవితమును త్రిధా విభజింప వచ్చును. అతడు యుద్ధమున పాల్గొనుటకు పూర్వము గడపిన జీవిత మొకభాగము. కదన రంగము నుండి తిరిగి వచ్చుట మరొక భాగము. చివరిసారి సమర భూమికేగి వీరస్వర్గ మలంకరించుట వేరొక భాగము.

తిక్కన దానపరుడనియు, మహావీరుడనియు, దయాసముద్రు డనియు, సత్యసంధుడనియు, యశస్సంపన్నుడనియు, తేజోమూర్తి యనియు దశకుమార చరిత్రమున కేతనకవి వర్ణించినాడు. అంతే గాక జనశ్రుతియందు జీవించు చాటు వొకటి ఖడ్గతిక్కన గుణసంపత్తిని చాటుచున్నది.

వీరనినాదంబు వేద నినాదంబు
పాయక యే ప్రొద్దు మ్రోయుచుండు
భూసుర ప్రకరంబు సేనలు చల్లంగఁ
బాయకెన్నియొ కుటుంబములు బ్రదుకు
బ్రాహ్మణావళికి ధారలు వోసిన జలంబు
సతతంబు ముంగిట జాలువారు
విపుల కొసగిన పత్రికల పుత్రికలను
పాయక కరణముల్ వ్రాయుచుంద్రు

మానఘనుడైన తిక్కనమంత్రి యింట
మదనసముడైన తిక్కనమంత్రి యింట
మహితయశుడైన తిక్కనమంత్రి యింట
మంత్రిమణియైన తిక్కనమంత్రి యింట.

తిక్కన నిత్యజీవిత మింత పవిత్రమట. అటు బ్రాహ్మ్యము ఇటు క్షాత్రము సమమైన పాళ్ళలో గలిసిన తేజోమూర్తి తిక్కన.

నెల్లూరు ప్రభువైన నల్లసిద్ధికి, కనిగిరి ప్రభువైన కాటమరాజుతో 'పుల్లరి' కారణముగ పోరాట మేర్పడినది. సిద్ధిరాజు యుద్ధమును తప్పింప వలెనని భట్టు నొకని రాయబార మంపినాడు. పుల్లరి నడుగ వచ్చిన భట్టునకు యాదవప్రభువు చెప్పిన సమాధాన మిది.

పుల్లరంటే కాసు పుట్టదిచ్చోట
నీమాట మీరాజు కెరిగింపవోయి
సమ్మతి గాదేని సరగ మామీద
దండెత్తి మీరాజు దరలి రమ్మనుము
కాక మాపెద్దల కడు యుద్ధమహిమ

చెవికెక్క యుండు మీ క్షితిపాలకునకు
కదనమంచే వీడు కదల లే దేమొ
తరచు మాటలు మాని దాగుండు మనుచు.

ఈ సమాధానముతో సంధి విఫలమైనది. ఇరుపక్షముల వారును ముమ్మరముగ సమర సన్నాహములు చేసినారు. కాటమరాజునకు కుడి భుజము పలనాటి ప్రభువు పద్మరాఘవుడు. చల్లపిన్నమనేడు, దొన కొండ అయితన్న, కరియావులన్న, ఆవుల పోలరాజు మొదలగు మేటి వీరులు కాటమరాజు పక్షమూని పంచలింగాల పర్వత ప్రాంతమున సైన్యమును సమీకరించి, నల్లసిద్ధిని నమలివేయ నెంచి నాగుబాములవలె నాలుకలు గోయుచున్నారు. విఫలుడై వెనుదిరిగిన భట్టు వాక్యములు విని ఆగ్రహోదగ్రుడైన నల్ల సిద్ధియు యుద్ధమును నిశ్చయించి, తిక్కన మంత్రిని తక్షణమె పిలిపించి తనవైపు వీరులకు వెంటనే లేఖలు వ్రాయించినాడు. బోయకొట్టాలకు పదివేల వింటి కోలలకై పత్రికను పంపించినాడు. తిరువణామల తిప్పరాజు ఇరువదివేల దండుతోడను, అద్దకొండ అచ్చిరాజు మూడువేల మూకతోడను గయకొండ గంగరాజు పదివేల బలగముతోడను భూనభోంతరాళములు దద్దరిల్ల బయలుదేరి వచ్చినారు. వీరికి దోడు ఉర్లకొండ సోమయ్య, ఉదయాద్రి ఉమ్మయ్య, చెన్నపట్టణ చంద్రశేఖరుడు, కాళహస్తి తిమ్మరాజు, నందికనుమ నాగరాజు మొదలగు వీరులందరు తమ తమ సైన్యములతో తరలి వచ్చినారు. ఆల్లూరి మూకలు గూడ అరుదెంచి వచ్చిన వట. ఈ సైన్యమంతయు సర్వేపల్లి మిట్టమీద సమీకరింప బడినది. ఆనాటి సర్వేపల్లి మిట్ట వివిధ దిశలనుండి ఉప్పొంగి వచ్చిన వాహినీ సమూహములు సంగమించిన సైన్యసాగరమైనది. సిద్ధిరాజు భద్రగజము నధిరోహించి, అశ్వారూఢులైన ఆప్తులిరుగడల కొల్వగా, మంగళవాద్యములు ముందు నడువగ, మంత్రులతో

గూడి ఆ సైన్యమును చూడ వచ్చినాడు. సిద్ధిరాజును జూచి దుర్గాధిపతులు సైన్యమంతటిని చక్కగ వరుసలు దీర్చినారు. ప్రభువు ఆ వరుసలను సమీక్షించుచు నడచినాడు. గజబలము, అశ్వబలము, పదాతిదళము, లొట్టిపిట్టల సమూహము సమరోత్సాహచోదితమై వెనుకనడచినది. ఆ సైన్య విన్యాసముల నమీక్షించిన సిద్ధిరాజు సంతుష్టుడయ్యు స్థైర్యము చాలక మరునాడు సభ చేసినాడు. తన సేనానివహంబులు సాటిలేని వనియు, ఒక్క పటాలమే యాదవుల పరిమార్ప గలదనియు ధైర్యమును పలికినాడు. కాని సిద్ధిరాజున కా ధైర్యమట్టె నిలువలేదు. యాదవుల పక్షమున వాసుదేవుని అవతారముగ పేరుపొందిన బొల్లావు పోరాడు ననియు, అతిధైర్యసాహసులైన చల్లవారు వారికి సాయ మున్నారనియు, విధిలిఖిత మెట్లున్నదో యనియు విజయమును శంకించినాడు. వివర్ణ వదనుడైనాడు. అట్టి ఘట్టమున ఖడ్గతిక్కన కలుగజేసికొన్నాడు. లేచి నిలిచి సిద్ధిరాజును సంబోధించి "చల్లవారి నట్టె సన్నుతింపకుడు. మన ముందు చల్లవారెంత ? మనదళము లారామడల నాక్రమించియున్నవి. మన బలముతో యాదవ బలమును పోల్చుట కులపర్వతములను పోలుపల్లె తిప్పలకు పోల్చుట. నన్నొక్కడిని పంపిన చాలును. చల్లవారినేగాక శత్రుసైన్యమునంతను సమయించి వత్తును"- అని పౌరుషము పొంగి పొరలునట్లు పలికినాడు. పంపవలసినదిగా ప్రభువు నర్థించినాడు. అందులకు సిద్ధిరాజు బదులు పలుకలేదు. బహుశః అతనిని విజయశంక ఇంకను వీడకుండెనేమొ. అంతటితో ఆనాటి సభ ముగిసినది. మరునాడు మరల సభ జరిగినది. తా నడిగినను ప్రభువు అనుమతించలేదన్న నెపము నల్లసిద్ధిపై నెట్టి తప్పించుకొనక తిక్కన చిత్తశుద్ధి తన ప్రార్థనను పునరుద్ఘాటించినది. అందులకు నల్లసిద్ధి నవ్వినాడట. భావగర్భితమైన తన నవ్వునకు నల్లసిద్ధియే భాష్యము చెప్పియున్నాడు.

కరణాల దేయూరు కయ్యో మే యూరు
చదువను చదివింప సరి సంప్రతింప
వ్రాయను వ్రాయింప వ్యవహార సరణి
లెక్కింప మీకు జెల్లిన దంతెగాని
నరుల కండలు రాల్చ నలవాటు లేదు.

ఈ మాటలకు తిక్కన్న తలవంచి కూర్చొనలేదు.

కరణమంచును గృపగల్గిన జాలు
బ్రాహ్మణుండనె నిజము రానీను కొరత
యీ పని కంపుమీ యీడేర్చి వత్తు
గట్టిగా సెలవిచ్చి కలనికి బంపు—

అని అద్భుతమైన ఆత్మప్రత్యయమును, అద్వితీయమైన అనుభావమును ప్రదర్శించుచు ఆ మహారాజు హృదయము నాకట్టినాడు. తిక్కన చిత్తశుద్ధి, ప్రభుభక్తి, ప్రతాపస్ఫూర్తి ప్రభువును పరవశుని జేసినవి. సిద్ధిరాజు గంధమును కస్తూరిని పూసి తబుకుతో తాంబూలమిప్పించి పోయి రమ్మని ఆ వీరపుంగవుని పంపించినాడు.

ఒక్కమాట. తిక్కన నల్లసిద్ధి ఆస్థానమున దండనాథుడై యుండడు. గ్రంథమందంతటను తిక్కన పరముగ మంత్రియను మాట వాడబడినది గాని సేనాపతి యను పదము ప్రయోగింప బడలేదు. ఆతడు దండనాథుడే యై యున్న యుద్ధమున కేగుదునని నల్లసిద్ధి నంత ప్రార్థింప నక్కరలేదు. నిండు సభలో నల్లసిద్ధిగూడ తన దండనాథుని సమర్థతను శంకించి అపహసించుటయు అసంబద్ధమగును. కావున తిక్కన అతని ఆస్థానమున మంత్రియై వ్రాతపనులను, రాజకీయములను నిర్వహించుచుండెననుట సమంజసము. కాగా నాటి సభకు నల్లసిద్ధి తిక్కనను పిలి

పించుట గూడ-సిద్ధముకండని సామంత ప్రభువులకు పత్రికలు వ్రాయించుటకుగాని, సమరవ్యూహముల చర్చించి నిర్ణయించుటకుగాదు. అయినను ఆనాటి మంత్రులు కార్యచతురులే గాక ఖడ్గనిపుణులు. వీరవిహారము వారికి వెన్నతో బెట్టిన విద్య. పౌరుషము వారికి ప్రాణవాయువు. ఇక తిక్కన విషయము తెలుపవలెనా. ఆతడన్ని రంగములందును సర్వసమర్థుడని పేరుపొంది మహారాజునకు మిక్కిలి అభిమాన పాత్రుడై యుండును. అట్టి తిక్కన, అంత సైన్యమును గలిగి ఆ సైన్య విన్యాసముల నన్నిటిని స్వయముగ పరీక్షించి ధైర్యము చాలక దీనుడై దిక్కులేనివాని వలె దిగులుపడు నల్లసిద్ధిని చూచినాడు. వెంటనే యువకుడైన తిక్కనలో ఉడుకు రక్తముపొంగినది. ప్రభుభక్తి నిలువెల్ల నిండిపోయినది. ప్రతాపము ప్రజ్వరిల్లినది. రాచకార్యములు దాటి రణరంగమున ప్రవేశింప నక్కరలేని తిక్కన, ప్రాణమునే లెక్కగొనక పోరునకు పరుగెత్తినాడు. ఇది తిక్కన జీవితములో తొలిమలుపు.

అది తిక్కన తాను కార్యశూరుడని నిరూపించుకొను క్షణము. ఉత్తమాశ్వము నెక్కి వీరలాంఛనములతో సైన్య సమేతుడై చాగలకొండ కేగినాడు. అట మహాసంగ్రామమున మొదటిభాగము జరిగినది. చల్ల పిన్నమనేడు సైన్యముతోవచ్చి తిక్కనను తాకినాడు. అతని తాకిడికి తిక్క సైనికులందరు సుడిగాలి దెబ్బకు రాలిపోయిన పండుటాకులవలె పడిపోయినారు. తిక్కన యేకాకియైనాడు. రాజు వద్దన్నను వినక వచ్చితినని, ఒంటరిగ బ్రదికినను ప్రయోజన మేమున్నదని తలంచి అశ్వమ్ము నదిలించి యాదవ బలముపై వీరావేశమున విజృంభించినాడు. కాని అతని వీరావేశమున ఆలోచన అడుగు పెట్టినది. "వద్దు వద్దన రాజు వచ్చితి నేను" అను వాక్యమే అందులకు నిదర్శనము. ఒంటరి వాడయ్యును విజృంభించుచున్న ఆ మహావీరుని వీరావేశమును సమయాను

కూలముగ చల్లపిన్నమనేడు చల్లబరచినాడు. "పోరు నిల్పగదోయి, భూసురోత్తముడ! అని ప్రారంభించి, మీ రగ్రజన్ములనియు, మేము యాదవులమనియు, ఉగ్రంబు మా మీద ఉంచరాదనియు, బ్రాహ్మణ హత్యకు మేము భయపడుదుమనియు" భక్తిని ప్రదర్శించినాడు. ఇది పిన్నమనేడు భయపడి చూపిన భక్తిగాదు. యుద్ధ మధ్యమున ఇట్టి భక్తి ఏకాకియైన ఏ విరోధివీరుని వివశు చేయదు! కాని ఆ మాటలు గూడ తిక్కనకు ఆగినట్లు లేదు. అది గ్రహించిన పిన్నమనేడు ప్రసంగమును పొడిగించినాడు.

ఆ మీద నెరుగఁదు వన్నియు నీవు
భూమీశు డెరుగని పోరు నీకేల ?
దవ్వున నున్నాడు ధారుణీశ్వరుడు
ఇచటి నీ యుద్ధంబు నెవరు చూచేరు
పోరు నీకేల పో బుధపుంగవుండ
ఇట సిద్ధిరాజు దండెత్తి రమ్మనుమి-

అని పలికినాడు, ఒంటరి వాడయ్యును, జయింప శక్తిలేకున్నను, అభిమానమున కాహుతి కాబోవు ఆ వీరుని స్థితిని సానుభూతితో తెలిసికొని పిన్నమనేడు ప్రదర్శించిన ఔదార్యము ప్రతివ్యక్తియు ప్రశంసింపదగినది. ఇందు లౌకికము కొంతపాలు కలియకపోలేదు. అయినను ఆ చల్లని మాటలకు తిక్కన శౌర్యము చల్లబడినది. పిన్నమనేని ఇంటిపేరు ఎంత సార్థకమైనది! అశ్వారూఢుడై యున్న తిక్కన అట్టె ఆగిపోయినాడు. అతనికి ఆలోచన అధికమైనది. ఆవేశమను గుఱ్ఱమునకు ఆలోచన కళ్ళెము.

యతిప్రాస లుండని యా కైత యేల ?
సుతి గూడి నడవని నొగసు పదమేల ?

పతి సూచి మెచ్చని బంటు దనమేల ?
ఇతరులు మెచ్చని యీ౨ె సాధనమేల ?
యే బోయి రాజున కిపుడు చెప్పినను
దగు బలంబుల గొని దండె త్తివచ్చు
మునిదళముతో వచ్చి ముందుగా నేను
పగతుర జంపుదు పల్లవుల్ మెచ్చ
పల్లవారిని ద్రుంతు సమరంబులోన

అని తిక్కన మనస్సు మాటాడుకొన్నది.

తిక్కన వినిశ్చయముతో వెనుదిరిగి వచ్చినాడు. అశ్వశాలలో తన తేజీని గట్టి శయ్యపై అలసట దీర్చుకొనుచున్నాడు. సిద్ధనామాత్యుడు శీఘ్రమే వచ్చి కయ్యపు విశేషము లేమని కొండంత ఆశతో కొడుకు నడిగినాడు. తిక్కన మౌనము వహించినాడు. ఆ మౌనమందలి అర్థ మెరిగిన తండ్రి :

కొడుక ! ఈ వంశంబు కడు దొడ్డదోయి
పెద్దకాలమునాడు పేరు మోసినది
పులి కడుపున గొడ్డె పుట్టు చందమున
కలిగితి నా యింతి గర్భంబునందు
తిక్కన ! నీ సాటి ధృతి లేరనంగ
సాహసంబున వారి సాధింప బోయి
యింతగా వెన్నిచ్చి యిటువలె రాను
మగతనంబున బుట్టి మగవాడవనుచు
పగతుకు వెన్నిచ్చు ప్రాణంబదేల ?
యరులకు నోడి యీ యువని మనుకన్న

సరగ రణభూమిలో సమయుట మేలు
పందవు గాని భావజ్ఞుడవు గావు
ఎందు కీ ప్రాణం బదేల యీ బ్రదుకు"

అని తూలనాడినాడు. వీరరసము మూర్తీభవించిన ఆ పితృమూర్తి, తనయుని తరిమి తెచ్చినది దౌర్బల్యమే యని యెంత పరితపించెనో ; ఆ వృద్ధవీరుని పౌరుషాగ్ని ప్రజ్వరిల్లినది. అత డనిన ప్రతి అక్షరము ఆగ్నేయాస్త్రముగాని అన్యముగాదు. కాని ఆ మాటలకు తిక్కన కలత నొందలేదు.

ఇంతలో తిక్కన తిరిగి వచ్చిన వార్త తెలిసి పురజనులు పరిహాస మాడుచు పలుకరింప వచ్చినారు. ఎన్ని విధములుగనో ఎగతాళి చేసినారు. కడకు

"ఘన చక్రబాణాలు గారెలుగావు
అర్చి దూసెడి కత్తు లరిసెలు గావు
వాడిచేటి బల్లెముల్ పూర్ణముల్ గావు
కుంతముల్ రుచి పప్పుకూరయు గాదు
కమ్మని పాయసము గాదు కయ్యంబు
వండిన యా పిండి వంటయుగాదు
బంటుతన మేయూరు బ్రాహ్మ దేయూరు"

అని విషముపూసిన వాడిబాణముల వంటి వాక్యములు విసరినారు. పాపము , తిక్కన తలవంచక తప్పలేదు.

మధ్యాహ్నమైనది. పతివ్రతామణియైన చానమ్మ అలసివచ్చిన భర్త ఆకొని యున్నాడని గ్రహించి స్నానమాడుటకు నీళ్ళుతోడినది. ఆమె పతిసేవ అంతతో ఆగలేదు. పంచ మధ్యముంచి 'అర్ధసేరు పసుపు ముద్ద,' ప్రక్కనబెట్టి 'కూర్చుండి స్నానంబు గొబ్బున చేయు' మని అత్త

దగ్గరకు తిరిగి వెళ్ళినది. ఆ దృశ్యమును చూచిన తిక్కనకుచ్ఛ్వాస నిశ్వాసములు స్తంభించి యుండును. ఆ మర్యాదకు మగని హృదయమే గాదు మంచుగడ్డ గూడ మహాగ్ని గోళముగ మారిపోదా: నీ కూతురు నీరాడి వచ్చుననియు, అడ్డబొట్టు పెట్టి చెక్కిలి గంధము పూసి అన్నంబు వడ్డించు మనియు మిక్కిలి వినయముగ అత్తగారికి మనవి చేసినదట. ఆమె మాటలకు పాఠకులే గాదు ఆమె మామగారు గూడ మనస్సునిండ మెచ్చుకున్నారు. ఖడ్గతిక్కన కుటుంబమున ఆ వీరపత్ని నిర్వహించిన పాత్ర అట్టిది.

తిక్కన తానమాడి తిండి తినవలెనని తల్లి కడ కేగినాడు. ఆమె ప్రీతితో పీటవేసి, ఆప్యాయముగ అన్నము వడ్డించి " ఆకొని వస్తివి యరులకు నోడి భోంచేయు" మని ఆదరముతో పలికినదట. అవి ఆదర వాక్యములా ! పచ్చగడ్డి కప్పియున్న అగ్నిపర్వతములు. తల్లి, విరిగిన పాలు తనయునకు వడ్డించినది. ఆత డందులకు ప్రశ్నించినాడు.

"అరుణోదయము వేళ నది యెల్లొగాని
యావులు బెయ్యలు నట మేయబోయి
యరులతో బోరాడి యటు మీద నీవు
విరిగిన నిను జూచి విరిగెను బాలు"— ఇది ఆ కుటుంబము

లోని వీరమాత కొడుకు కిచ్చిన సమాధానము.

ఇట్టి ఘట్టమున వేరొక్కడైన ఊడబెరికిన తోటకూరవలె వాడి పోయెడివాడే. కాని తిక్కన ప్రదర్శించిన తత్త్వము వేరు. ఆత డన్నము తిని కప్పురవిడెము సేవించి సన్నజాజుల సెజ్జపై శయనించినాడు. తెల్లవారగ లేచి కాలకృత్యములదీర్చి ఆభరణముల నలంకరించుకొని వేవేగ

భోజనము చేసి వీడియము సేవించి తన ప్రతిన దెలుప తండ్రికడకేగినాడు. ఆ వీరు డంత నిండుదనమును ప్రదర్శించినాడు. తిక్కన తండ్రికడకేగి

ఓ తండ్రి వినవయ్య యొక విన్నపంబు
నాయొక్క కీర్తి యానందంబు నొంద
యదుబలంబుల మీది కరుగుచున్నాద
వారిని దునుమాడి వస్తినా మేలు
పోరాడి వారిచే బొలిసితినైన
నీ వట కా వార్త నిజమని దెలిసి
వేవేగ రణభూమి వెదుకంగ రమ్మ
అముకొని పగవారి హతము సేయంగ
కవగొని పగరు నా కండలు నరుక
పగర నెమ్మలె యున్న పగతుర ద్రుంతు
నొకచోట నుండ బో దొనరగా బొంది
కదనంబులో బొంది కానకుంచేను
నచ్చట నిచ్చట నా యుద్ధభూమి
పరగ కండలు నెగిరి పడుచుండెనేని
తిక్కన్న కండలని తెలియంగ జూడు"

అని తన ప్రతినను దెలిపినాడు. తాను జయించిన తిరిగివత్తునని, లేనిచో రణరంగమున మరణించి వీరస్వర్గము నలంకరింతునని నిశ్చయించి తండ్రికి చెప్పినాడు. తన పౌరుషము నొకపరి అనుమానించిన తండ్రి ఆ నిశ్చయమును నమ్మెనో లేదో? అందుచే "నీ వట కా వార్త నిజమని తెలిసి వేవేగ రణభూమి వెదుకంగ రమ్మ" అని నొక్కి చెప్పినాడు. కాగా విరోధివీరులు నా కండలు నరికివేసినను మిగిలియున్న ఎముకలతోడనే

శత్రుసైన్యమును సంహరింతునన్నాడు. అట్టిది అతడు పట్టిన ప్రతిన. ఆ పౌలికలనిలో తండ్రి తన శవమును గుర్తు పట్టుటెట్లు ? పౌరుషము తగ్గక ఏ కండ లా యుద్ధభూమిలో ఎగిరిపడుచుండునో అవన్నియు తిక్కన కండలని తెలియుమన్నాడు. ఎంతమాట ! ఈ మాటలో షడ్గ తిక్కన వీరావేశముయొక్క విశ్వరూపమును సిద్ధనామాత్యుడేగాక సహృదయుడును దర్శింపగలడు. ఆ మాటకు తండ్రి తన్మయుడై తల యూపి యుండును. తిక్కన, తండ్రికి మ్రొక్కి గుఱ్ఱమెక్కినాడు.

వీరునకు విజయము, వీరస్వర్గము ఉచ్ఛ్వాస నిశ్వాసములు. అత డసువు లర్పింప సిద్ధమై యుద్ధమున అడుగుపెట్టును. చావునకు జంకు వాడు వీరుడుగాడు. అటులని వ్యర్థముగ మరణించుట మూర్ఖత యగును గాని వీరత్వ మనిపించుకొనదు. వీరుడు మొదట కోరవలసినది విజయమే. విజయసాధనకు వివేకము ప్రధానము. అందుచేతనే వివేకము వీరత్వమున ఉత్తమాంగమనిపించుకొన్నది. ఒక్కొక్కసారి అపజయమును శంకించి అనుకూల పరిస్థితులకై వెనుదిరుగుట వివేకయుతమైన వీరత్వమే. అది పారుబోతుతనమని పొరబడరాదు. వ్యర్థముగ మరణించు మూర్ఖుని కంటె విజయము సాధించు వివేకియే వీరుడు. వీరుడై సవాతు వీలున్నంతవరకు వివేకముతో విజయము సాధింప యత్నించి విఫలుడైనపుడు వీరస్వర్గమును వరించును. పై విషయమును వ్యాసభగవానుడే భారతమున ప్రదర్శించి నాడు. పట్టపగటింటి సూర్యబింబమువలె వెలుగుచున్న కర్ణుని జూచి జగదేక ధనుర్ధరుడైన ధనంజయుడు "మాధవా మన రథమ్మును మరల నిమ్మ" నుటయు. అంతటి మాధవుడు గూడ రథమును మరలించుటయు సమర వివేకము గాని వేరుగాదు. వ్యాసుని దృష్టిలో అర్జునుడు మహావీరుడు గాదా ? ఖడ్గతిక్కన తిరిగివచ్చినది ప్రాణభీతిచే గాదు. ప్రాణములకు తెగించి విజయమును కాంక్షించి అతడు పోరున అడుగు పెట్టినాడు.

ఒంటరియయ్యు విరోధిమీదికి విజృంభించినాడు. అతని విజృంభణము చూచియే చల్లపిన్నమనేడు సంభాషణ సాగించినాడు. వద్దు వద్దన వచ్చి వ్యర్థముగ యుద్ధరంగమున మరణించి నల్లసిద్ధి కపజయము గొనివచ్చుట అవివేకమనియు, అదియొక విధముగ ప్రభుద్రోహమనియు తిక్కన భావించి యుండను. కావుననే వెనుదిరిగివెళ్ళి వాహినీనిపహములతో వచ్చి విజయమును సాధింప సమకట్టినాడు. మీదుమిక్కిలి "మునిదళముతో వచ్చి ముందుగా నేను పగతుర జంపుదు పల్లవుల్ మెచ్చ" అని నిశ్చ యించినాడు. అందుచే తిక్కనను త్రిప్పిపంపినది ప్రాణభీతి గాదు; ప్రభు విజయమే. సామాన్యముగ ఇట్టి వివేకము వీరత్వమును శంకింపజేయును. కావుననే తండ్రి, భార్య, ప్రజలు కడకు కన్నతల్లి అతని నవమానించి నారు. అతడు మరల యుద్ధరంగమున అడుగుపెట్టుటకు ఆ యపమాన ములు హేతువులు గావు. పవిత్రమైన వివేకముతో గూడిన ఏ ప్రగాఢ నిశ్చయ మాతనిని యుద్ధరంగమునుండి వెనుకంజ వేయించెనో ఆ నిశ్చ యమే తిరిగి అతనిని యుద్ధరంగమునకు తరిమి పంపినది. అట్టి నిశ్చయ మున్నవాడు గనుకనే మాటలన్న వారందరు తన మనస్సు నెఱుగని వారని మౌనము వహించినాడు. మహాగంభీరముగ మెలగినాడు. తన్నంత తక్కువచేసి తూలనాడు వారితో తన అభిప్రాయమును తెలియజెప్పుకొనుట అభిమానధనుడైన ఆ వీరునకు అగౌరవ మనిపించి యుండును. అందు వలననే ఎందరెన్ని అనుకొనుచున్నను ఏమాత్రము తొట్రుపాటు లేక తృప్తిగా భోజనముచేసి కర్పూరతాంబూలము సేవించి కయ్యమునకు కాలు కదల్చినాడు. అతని నిర్ణయము నిప్పు. ఆ వ్యక్తులందరు వీవనలు. మొదటిసారి విజయసాధనకై వెనుకంజవేసివచ్చిన తిక్కన రెండవసారి విఫలుడైనచో వీరస్వర్గమునే వరింప నిశ్చయించి ముందంజ వేసినాడు.

అశ్వమెక్కి వీరావేశమున విజృంభించివచ్చు తిక్కనను చల్లపిన్నమ నేడు దర్శించినాడు. బ్రాహ్మణ వధకు వెనుకాడు పిన్నమనేనికి మరల పెద్ద

సమస్య "చంపగూడగ రాదు చావగారాదు" అను చిక్కునబడి అతడు చింతింపసాగినాడు. ఇంతలో బ్రహ్మరుద్రయమంత్రి ముందునకు వచ్చి పిన్నమనేని భయమును పారద్రోలి

"ఆజిలో నీవ నేనై యొప్పగలను
బ్రాహ్మడాతడు శివబ్రాహ్మడ నేను
బ్రాహ్మణులము పోరు పాటింప గల" మని

పౌరుషముతో పలికినాడు. పిన్నమనేని చిక్కు తీరినది. వెంటనే "వీరకాసె" బిగించి, విభూతి రుద్రాక్షలు దాల్చి, వీరాంకములు మేన వెల యించి అపర వీరభద్రునివలె బ్రహ్మరుద్రయ్య వృషభమెక్కి విజృంభించి ఖత్గతిక్కనమీద కరవాలు ఝళిపించినాడు. వారి పోరు భీకరమైనది. తిక్క దుద్రిక్తుడై తొలుత రుద్రుని తెగవేసినాడు. తరువాత రుద్రుడు ఖడ్గధారతో తిక్కన తలద్రుంచినాడు. బ్రహ్మరుద్రయ్య మృతికి పిన్నమనేడు పెద్దగా దుఃఖించి కన్నీరు నించుచు కృతజ్ఞతను చాటుచు సమాధి గట్టించినాడు.

హతశేషులు సింహపురికేగి సిద్ధనామాత్యునికి తిక్కన మృతి దెలిపి నారు. అతని వీరవిహారమును వర్ణించి చెప్పినారు. ఆ వృద్ధవీరుడు వెంటనే రణభూమికేగి అట తనయుని మృతికి దుఃఖమొందక తన జన్మ తరించినట్లు తృప్తిపొందుచు పలికిన వాక్యములు విశ్వచరిత్రకే వన్నె పెట్టగలవు.

కొడుక ! నీ రణము భర్గుం డెంచవలెను
నరులకు నెంచగా న్యాయంబుగాదు
ఇనకులాధీశ్వరుం డీ సిద్ధిరాజు
ఋణము దీర్చుటకుగా నేతెంచినావు
ఫణిరాజు గొనియాడ బగ ద్రుంచినావు

పేరుగల యా పుణ్య పెన్నసాక్షిగను
కలువల రాజు భాస్కరుడు సాక్షిగను
నిలిపితి నీ కీర్తి నిఖిలంబునందు"-

అని పలికి కొడుకు చెప్పిన గుర్తులను బట్టి కళేబరమును వెదకినాడు

"జలధిలో మీనముల్ చలియించునట్లు
నెత్తుటి వట్టిలో దుత్తునియలుగ
తిక్కన కండలు తేలాడు చుండె
నెగి నెగిసి పడుచుండె నీవలావలకు"

అట్టి కొడుకు కండలను, కంట తడిపెట్టుచు ఒక్కటొక్కటిగ తన చేత నేరి, కావిధోవతిలో పొదిగికట్టి, ఆ మూటను మూపున బెట్టుకొని, ఒక్క వేడినిట్టూర్పు విడిచి, నెత్తురుముద్ద వలె నెల్లూరు వైపు నడచు ఆ పితృమూర్తిని చూచుచు సహృదయుడు చేతులెత్తి నమస్కరింప వలసినదే గాని చెప్పవలసిన దేమియుండును.

పతివ్రతామణియైన వీరపత్ని చానమ్మ 'నా ప్రాణవిభునితో నన్నంపు' మనుచు సహగమనమున కాజ్ఞనిమ్మని సిద్దనామాత్యుని కోరినది. సిద్ధనమంత్రి నిశ్చింతుడై విప్రవర్యుల బిలిపించి సాగుమానక్రియలు జరిపించినాడు.

నల్లసిద్ధి మిగత యుద్ధమును నిర్వహించినాడు. కడకు కాటమరాజు పక్షమే జయించినది.

మహావీరుడైన ఖడ్గతిక్కనగాథ దేశకవితకు వన్నెపెట్టుటయేగాక వర్తమాన యువక వీరులకు ఉత్సాహ మొసగ గలదు.

★

# తెలుఁగు చాటువులు

ఆంధ్రవాఙ్మయమున చాటుపద్యములు చాల గలవు. ఆంధ్రముననే గాదు ఏ వాఙ్మయమందైనను ఇట్టి రచన లుండకపోవు. ఇవి చాలవరకు ఆశువులుగా వెలువడినవే. మీదుమిక్కిలి ముక్తకప్రాయ రచనలు. అనగా ఒక్కొక్క చాటువునందలి భావములు ప్రబంధమందలి పద్యములలోవలె ముందు వెనుకలకు ముడిపెట్టబడక స్వయంసంపూర్ణముగ నిలిచియున్న రచనలు. కవులు పట్టుబట్టి కూర్చొని నిబద్ధకావ్యముల వలె వీనిని కూర్ప లేదు. పరిస్థితుల ప్రభావముచే కవుల హృదయమున గలిగిన అలతి యలతి ప్రకంపనములు ఛందోరూపమును దాల్చి చాటువులైనవి. ఇవి వాఙ్మయోద్యానమున వేసిపెంచిన వనలతలు గావు; గాలికి పడి మొలిచిన గడ్డిమొక్కలు. విరియబూచి కమ్మని తావుల వెదజల్లు గడ్డిమొక్క లున్నట్లే సరసములై సహృదయుల నాకర్షించు చాటువు లున్నవి.

చాటురచనలలోని సూక్తులు చెప్పదగినవి. సూక్తి యనగా మం.. మాట. ప్రపంచమును పరిశీలించి, అనుభవము నాధారముగాగొని, ధర్మ పథమునకు దీపికగా, మానవుని మనస్సున కెక్కునట్లు చెప్పు మంచిమాట సూక్తి. ఇది సుదీర్ఘముగ నుండరాదు. సూక్తి సూత్రప్రాయమే. అనగా "అల్పాక్షరముల ననల్పార్థ రచన." ఇంతేగాక నిర్దుష్టత, ఉక్తివైచిత్రి గూడ సూక్తి కుండవలెను. వీనికి దోడు మాటఘాటు చేరెనా సూక్తిశోభ ఇనుమడించును.

ఒక కవి ఆఢ్యుని ఆతని అనుచరులను చూచినాడు.

ఆఢ్యుఁడున్నయప్పు డందఱుఁ బూజ్యులే
లెక్కమీద సున్న లెక్కినట్లు
అతఁడు పోవు వెనుక నంద ఱపూజ్యులే
లెక్కలేక సున్న లేఁగినట్లు.

అని చాటువును చెప్పినాడు. అంకెమీద సున్నలుచేరుకొలది సంఖ్య విలువ పెరుగును. కాని అంకెలేని సున్నలెన్నియున్నను విలువ శూన్యమే. ప్రయోజకులు కాకున్నను కొందరు ప్రముఖుని ప్రక్కనుండి పేరుపొందుదురు. ఈ చాటుకవి ఆఢ్యుని అంకెకు, ఆతని వెంటనున్నవారిని సున్నలకు పోల్చి ఒక్కొక్కరి విలువను మనస్సున కెక్కునట్లు నిష్కర్షగ నిర్ణయించి చెప్పినాడు. జగన్నాటకమున ఈ మాట చిరంజీవము.

అట్లే యొక కవి కార్యసాధకుని తత్త్వమును తెలియజెప్పిన పద్యము గూడ హృద్యమే.

చేతనగు వాఁడు కార్యము
కై తగ్గును వంగుఁగాక యల్పుండగునా ?
యేతము వడిఁదా వంగును
బాతాళము నీరుదెచ్చి బయలన్ జల్లున్.

సమర్థుడగువాడు కార్యమును సాధింపదలచి పరిస్థితులకు తల యొగ్గుటను కవి యిట చక్కగా సమర్థించినాడు. ఏత మాతనికి అద్భుతమైన ఉపమానము

ఉన్న లోభి, లేని ఉదారుడు ప్రపంచమునకు చాల పరిచితులైన

వ్యక్తులు. వారిలో ఎవరు మెలో తూకమువేసి తెలియజెప్పు త్రాసు వంటిది ఈ చాటుపద్యము.

కలిమిగల లోభి కన్నను
విలసితముగఁ బేదమేలు వితరణియైనన్
జలి చెలమ మేలు గాదా
కులనిధియంబోధికన్న ? గువ్వల చెన్నా !"

ఇందు కవి తన అభిప్రాయమున కిచ్చిన అలంకారము అవునవు నని సహృదయుల శిరఃకంపముల సాధించుచున్నది. ఇందలి నిర్దుష్టత, ఉక్తివైచిత్రిగూడ ఉగ్గడింప దగినవి.

ప్రపంచమున గమనింపదగిన యంశముల గొన్నింటి నొక్కచో జేర్చి మానవుని హెచ్చరించు చాటువు లున్నవి.

ఎవ్వడవీవు కాళ్ళు మొగ మెఱ్ఱన ? హంసము; నెందు నుందువో ?
దవ్వుల మానసంబునను; దాన విశేషము లేమి తెల్పుమా ?
మవ్వపుఁగాంచనాబ్జములు మౌక్తికముల్ గలవందు; నత్తలో ?
యవ్వి యెఱుంగ; మన్ననహహా ! యని నవ్వె బకంబు లన్నియున్.

అల్పులయ్యు అధికు నపహసించు ప్రజల తత్త్వమున కీ పద్యము ప్రతిబింబము.

పొరగగ నాల్గు పాదములు బాగుగ తుండము ఘీంకృతంబు మా
కిరువురకున్ సమంబె మఱి యెక్కువ యొక్కటి పక్షయుగ్మ మే
చరుఁడను నాకు సామ్య మొక సామజమా ? యని దోమ పల్క న
ట్లరయ మహానుభావులను నల్పుఁడు నోరికొలందు లాడెడిన్

పెద్దలతో పోల్చి చూచుకొని అంతకంటె నధికులమని దుర్విదగ్ధతతో విఱ్ఱవీగు అల్పుల కిది అవశ్యము తెలుపదగిన పద్యము.

గంధపుఁ జెట్టుక్రింద నురగంబు పయోనిధి బాడబాగ్ని మా
కందఫలంబు క్రింద నొక కందురుదుంప జగద్విలోక నా
నందము మేఘునందుఁ బివి నాఁచిన మాడ్కి సకారణంబుగా
నుందురు దాతసన్నిధి నయోగ్యులు కొందరు మల్లికార్జునా !

జీవితములో అడుగుపెట్టిన క్రొత్తబాటసారికి ఈ చాటువులందలి సూక్తులు చక్కని సులోచనములు.

పొగడుట యందును తెగడుట యందును చాటుకవులు చాల సమర్థులు. కష్టమనిపించినపుడు కవులు ప్రదేశములనేగాదు – ప్రజలనే గాదు– ప్రభువులనే గాదు కడకు పరమేశ్వరుని గూడ తెగడినారు. సంతసించిన సమయమున స్తోత్రపాఠములు చేసినారు. చిత్రమేమన, వారు ఎంత చమత్కారముగ పొగడ గలరో అంత చమత్కారముగ తెగడగలరు. వారి వాక్కునకు రెండుప్రక్కల పదునే.

పొగడుటలో మన కవుల ప్రతిభ పావరసమును మించి ప్రసరించినది. ప్రార్థించునపుడు దేవుని, అర్థించునపుడు ప్రభువును కవులు ప్రశంసించినారు. అంతేగాక కవులను, కాంతలను, రసికులను పొగడినట్టి పట్టులుగూడ లేకపోలేదు. తమ ఇష్టదైవములైన విష్ణుమూర్తిని గూర్చియు, అతని అవతారముల గూర్చియు, శివుని గూర్చియు, అష్టదిక్పాలకులను గూర్చియు, ఆంజనేయుని గూర్చియు, ప్రార్థనారూపమున చెప్పిన చాటువుల సంఖ్య చాల యెక్కువ. ఈ యాటవెలది అట్టి వానిలో నతి పచురమైనది.

చేత వెన్నముద్ద చెంగల్వ పూదండ
బంగారు మొలత్రాడు పట్టుదట్టి
సందె తాయెతులును సరిమువ్వ గజ్జెలు
చిన్నకృష్ణ ! నిన్నుఁజేరికొలుతు"

కవి ఏ ముహూర్తమున వ్రాసెవో గాని ఇది ఆంధ్రదేశమున ప్రతి యింటను పలుకనేర్చిన పిసిపిల్లల నోటి ప్రథమ పద్యమైనది. అట్లే ప్రచారమున్న ప్రార్థనలలో నారాయణస్తుతి యొకటి.

ధర సింహాసనమై నభంబు గొడుగై తద్దేవతల్ భృత్యులై
పరమామ్నాయము లెల్ల వందిగణమై బ్రహ్మాండమాగారమై
సిరి భార్యామణియై విరించి కొడుకై శ్రీగంగ సత్పుత్రియై
వరుస న్నీ ఘనరాజసంబు నిజమై వర్ధిల్లు నారాయణా.

బహుదేవోపాసకులైన హైందవకవులు ఎందరో దేవతలను పేరు పేరున ప్రస్తుతించియున్నారు.

కాగా రాజులను పొగడు పట్టున కవులకు పరిధులే లేకుండ పోయినవి. అతిశయోక్తి ఉత్ప్రేక్షలవంటి అలంకారములే వారి కంటి కాగలేక పోయినవి. పూర్వకాలమున ప్రభువులు ప్రతాపజీవులు. అందరికన్న నీ ప్రతాపమెన్నదగిన దన్నచో ఆపూట అనసమర్థచక్రవర్తికైనను అన్న మక్కరలేదు. అందుచే కవులు రాజుల రూప గుణములకు దోడు వీరి ప్రతాపమును విశేషించి కీర్తించినారు.

గరళపుముద్ద లోహ మవగాఢ మహాశని కోట్లు సమ్మెటల్
హరు నయనాగ్ని కొల్మి యురగాధిపు కోరలు పట్టుకార్లు ది

క్కరటి శిరంబు దాయ లయకాలుడు కమ్మరి వైరివీర సం
హరణ గుణాభిరాముఁడగు మైలమభీముని ఖడ్గ సృష్టికిన్.

ఇది వేములవాడ భీమకవి చెప్పిన చాటువు. మైలమభీముని ఖడ్గము చేయుటకు గరిళపుముద్ద లోహమైనదట. ఆ లోహమును సమ్మెటవేయ వలెను. పిడుగుల సమూహమే ఆ సమ్మెటలు. కాగా ఆ లోహమును కాచుటకు కొలిమి యుండవలెను. అందులకు సామాన్యమైన కొలిమి సరిపోవునా ! ముక్కంటి మూడవ నేత్రమే కొలిమి యైనదట. ఇక అవసర మైనవి పట్టుకార్లు; దాయ. పాంపతేని కోఱలే పట్టుకార్లు. దిగ్గజశిరము దాయ. ఈ సామాగ్రితో ఖడ్గము చేయగల కమ్మరి యెవడు ? యమధర్మరాజే. ఏమి సృష్టి ! ఆ కత్తితాకున తల తెగుట యెట్లుండునోగాని దాని ఉత్పత్తి గుండెలు పగులునట్లు వర్ణింపబడినది. మల్కిభరాముడు మహమ్మదీయుడైనను ఆంధ్రకవుల నాదరించిన ప్రభువు ఆతనిని పొగడుటలో కవి ప్రదర్శించిన చమత్కారము.

రాజును రాజుగాఁ డతఁడు రాహు ముఖంబునఁ జిక్కె, వాహినీ
రాజును రాజుగాఁ డతఁడు రామ శరహతిఁ దూలె, దేవతా
రాజును రాజుగాఁ డతఁడు రావణ సూతికి నోడె, నాజిలో
రాజన రాజు మల్కి యిభరాముఁడె రాజు ధరాతలంబునన్.

అట్లే అనవేమ భూపాలుని గొప్పను జెప్పు గీతపద్య మిట పేర్కొన దగినది.

పంది కొమ్మెక్కి పెనుబాము పడగ లెక్కి
మేటి తామేటి వీఁ పెక్కి మెట్ట లెక్కి
విసివి వేసారి యనవేమవిభునిఁ జేరి
రాణివాసంబు గతి మించె రత్నగర్భ.

పెద్దన, తిమ్మన, రామకృష్ణకవి-వీరి కవితాప్రాశస్త్యమును పేర్కొను చాటు పద్యము.

అల్లసానివాని అల్లిక జిగి బిగి
ముక్కుతిమ్మనార్యు ముద్దు పలుకు
పాండురంగ విభుని పదగుంఫనంబును
కాకమానురాయ నీకు తగుర.

ఏ కవి ఈ చాటువును జెప్పెనోగాని ఆయా కవుల కవితకు చక్కగ విలువ కట్టినాడు. జనశ్రుతిలోనున్న చిన్న కట్టుకథ ఇచ్చట చేర్ప దగినదే. కాకమాను నృసింహరాయకవి కృష్ణరాయల కొలువునకు వచ్చి తన కవితను వినిపింప, పెద్దనాదు లందరు అతని కవనమును కొనియాడిరట. కాని కాకమానుకవి రామకృష్ణుని అభిప్రాయము కావలె నన్నాడట. అప్పుడు రామకృష్ణు డీ పద్యమును చెప్పినాడు. రామకృష్ణు డెవరినైన ఇంత హెచ్చుగా మెచ్చుకొనుట అసాధారణమే. అనుమానించుచు అమాత్యులు తిమ్మరుసుగారు అర్థాంతరమున్నదా యని అడగిరట. "పలుకవేమి రామ కృష్ణకవీ" యని రాయలు ప్రశ్నించినాడు. అనుగ్రహించిన మరొక అర్థముకూడ మనవి చేయగలను. అల్లసానివారు, ముక్కుతిమ్మనగారు, నరసింహరాయకవి కవితను ప్రశంసించుచుండ ఆయనకు వీపు జిలపుట్టు చున్నదేమొ వెనుక నానుకొన్న స్తంభమునకు వీపును రాయుచున్నాడు. అందుచేత అల్లసానివాని అల్లిక జిగిబిగి, ముక్కుతిమ్మనార్యు ముద్దుపలుకు, పాండురంగవిభుని పదగుంఫనంబు కాక-ఓ నృసింహరాయకవి, మాను-ఆ కొయ్యకంబమును, రాయ-రాచుకొనుట, నీకు-నీకు, తగుర-తగియున్నది- అను అర్థాంతరమును గూడ అందిమిడ్చితి నన్నాడట-రామకృష్ణుడు. నలుగురితోబాటు నృసింహరాయకవిగూడ నవ్వకుండునా ?

కవితకు రాసిక్యము తీసిపోవునదిగాదు. రసికునిగూర్చి చెప్పిన రమ్యమైన చాటువు.

> పనసముత్యా మొకటి చాలును
> గస వూడ్చిన చింపిరాలు గంపెం దేలా?
> రసికుం డొక్కడె చాలును
> రసహీనులు పదువు రేల రాయని బావా!"

ఒకనాడు తిరుమలరాయలు కవుల అతిశయోక్తులకు విసిగిపోయి తన్ను స్వభావోక్తిలో వర్ణింపుడని కోరినాడట. తిరుమల రాయలు ఒంటికంటివాడు. మీదుమిక్కిలి అతని భార్య ప్రక్కనున్నది. అట్టి వానిని స్వభావోక్తిలో వర్ణింప నెవడు సాహసింపగలడు. అందులకు సమర్థు డొక్కడే. అతడు తెనాలి రామలింగడు.

> అన్నాతిఁ గూడ హరుఁడవు
> అన్నాతిని గూడకున్న నసుర గురుఁడ వీ
> వన్నా! తిరుమలరాయా
> కన్నొక్కటి లేదు గాని కంతుఁడవయ్యా.

ప్రక్కనున్న భార్య రెండు కన్నులు, ఈతని ఒంటికన్ను కలుపుకొన్న ఈతడు ముక్కంటి యగునట. ఆమె కన్నులు కూడకున్న ఒంటి కంటితో నీతడు అసురగురుడగు శుక్రాచార్యు డగునట. కన్నొక్కటి లేదు. అయిననేమి మన్మథుడట, ఒక్క కూడిక; ఒక్క తీసివేత. ఎంత ముప్పు తప్పించుకొన్నాడు రామలింగడు! అటు గ్రుడ్డికుంకవని సత్యము చెప్పినట్లును అయినది; ఇటు గొప్పవాడని పొగిడినట్లును అయినది. ఈ పద్యమునకు అతిశయోక్తి స్వభావోక్తి బొమ్మ బొరుసుల వంటివి.

ఇక కవులు తెగడుట. అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి కొట్రావుల పల్లె కేగినాడు. అట నన్నియు ఉప్పునీటి బావులు. ఆ నీటిని నోట పోసికొను సరికి ఈ పద్యము బయటకు వచ్చినది.

దేవాసుర లబ్ధిఁ దరువ
నావిర్భూతమయి హాలాహల మపుడు మహా
దేవునకున్ భీతిలి కొ
ట్రావులపలి నూతులందు డాఁగెను జుండీ.

సముద్రమథనమున పుట్టిన హాలాహలము పశుపతికి భయపడి కొట్రావులపల్లి నూతులలో డాగినదట. పాపము! అతని నోరు ఎంత చెడ్డదో!

ఆసిదము సూరకవిని విజయనగరపుధాదీశ్వరుడు ఆగ్రహ మూని ఆస్థానము నుండి తొలగించెనట. బాదుల్లాఖానుతో ఆ రాజు యుద్ధమునకేగి పరాభూతుడై తిరిగి వచ్చుచున్నాడు. సూరకవి తన గ్రామము ప్రక్క త్రోవలో పనస చెట్టెక్కి విస్తళ్ళకై ఆకులను కోసికొనుచు రాజునుచూచి, ఎదురు పోయి పల్లకినాపి, కసి తీరున ట్లీ పద్యము చెప్పెనట.

మెత్తనై యున్న యరటాకు మీఁదఁ గాక
మంట మీఁదను జెల్లునే ముంటి వాఁడి
బీదలై యున్న సర్దార్ల మీదఁ గాక
కలదె క్రొవ్వాడి బాదుల్లఖాను మీఁద?

ఎంత తీవ్రమైన ఎత్తిపొడుపు! ఈ ఎత్తిపొడుపు రాజు గుండెలో ముంటివాడిని మించి నాటదా.

తిమ్మరుసు చరిత్రలో మహారాజులను మించిన మంత్రి. తొలి రోజులలో తిమ్మరుసు దుర్భర దారిద్ర్య పీడితుడై నికృష్టజీవితమును గడపినాడు. ఒకనాడు భట్టుమూర్తికి తిమ్మరుసుపై కోపమువచ్చి ఆ తొలి రోజుల విశేషముల నన్నింటిని తిరుగతోడినాడు.

గుత్తిం బుల్లెలు కుట్టి చంద్రగిరిలోఁ గూడెత్తి పెన్గొండలో
హత్తిన్ సత్రమునందు వేఁడి బలు దుర్గాధీశు తాంబూలపుం
దిత్తుల్మోసి పదస్థులైన ఘనులం దీవింప .... .... ....

ఆలసించిన ఇంకేమి తిట్టునో యని తిమ్మరుసు భయపడి పచ్చల హారమును బహూకరింపగా భట్టుమూర్తి ప్రహృష్టుడై

.... .... .... .... .... .... దీవించెదన్
మత్తారాతి యయాతి నాగమ సుతున్ మంత్రీశ్వరున్ ద్రిమ్మరున్.

అని పూరించెనట. పచ్చల హారముతో పద్య మెంత మలుపు తిరిగినది ; కవుల వాక్కునకు రెండు ప్రక్కల పద ననుట ఇట్టిదే.

కలిదిండి కామయ శ్రీనాథునకు బంధువు. కామయ కుమారుడు కేవల మవివేకివలె నున్నాడు. ఆ యవివేకి మీద శ్రీనాథున కసహ్యము గలిగి చెప్పిన పద్యము.

మా కలిదిండి కామ... కుమారకుఁ డన్నటఁ దండ్రివైఖరే
కాక తదన్యుఁ డెట్లగును గాడిదకుం దురగంబు పుట్టునే ?
చేకొని కొంకి నక్కకును సింగము పుట్టునె ? మాలకాకికిం
గోకిల పుట్టునే ? చిరుతకుక్కకు మత్తగజంబు పుట్టునే

ఈ కుమారకుడు తండ్రివంటి వాడేనట. ఇది విశేషము. దీనిని కవి సామాన్యాంశములచే సమర్థించు చున్నాడు. ఈ సమర్థనలో పితృస్థాన మాక్రమించినవి పశువులు; పక్షులు. అందును పశువులలో గాడిద, కొంకినక్క, చిఱుతకుక్క. పక్షులలో మాలకాకి. ఆ తండ్రి కొడుకుల తెలివి తేటలను, గుణవిశేషములను, రూపురేఖలను భావుకునకీ అర్థాంతరన్యాసము అద్దమువలె ప్రదర్శింప గలదు.

ఆంధ్రమున వృత్తిలేని వారందరు వక్తగనో, కవిగనో వేషము వేయుదురు. ఇట ఖర్చులేకుంత దొరకువాడు కవి. క్షణ క్షణ ప్రవర్ధమానమగు కవుల సంఖ్యకు కంటగించుకొనుచు మహానుభావు డెవడో మంచి పద్యము చెప్పినాడు.

దేవు నాన మున్ను దేశాని కొకరుండ
నిప్పు డూర నూర నింట నింట
నేవు రార్వు రేడ్వు రెనమండ్రు తొమ్మండ్రు
పదువు రైరి కవులు పద్మనాభ.

ఇట కవుల సంఖ్యతో విసిగిపోయిన శ్రీనాథుని వాక్యము గూడ చేర్పదగినది.

"కొండవీటిలో గాడిద। నీవును గవివి కాదుగదా ? యనుమాన మయ్యెడిన్."

నిరాశచెంది అరసికుని తెగడుచు నొక కవి చెప్పిన చాటువు.

కవితాలక్షణ మెఱుగని
యవివేకికిఁ బద్య మిచ్చి యడుగుట కంటెన్

చవిలేఁ గొని దండెఁగొనుకొని
భువిలో హరిదాసుఁడైనఁ బుణ్యమె దక్కన్.

అరసికునికి పద్యమిచ్చి అడుగుటకంటె జోలెపుచ్చుకొని హరిదాసు డగుటయే మేలనుట ఎంత మంచి మాట.

ఇంపుగలేని ఇంతులను కవు లెంతగా తెగడుచుందురో శ్రీనాథుని చాటువు చెప్పగలదు.

మేఁతఁ గరిపిల్ల పోరున మేఁకపిల్ల
పారుఁబోతుతనంబునఁ బందిపిల్ల
ఎల్లపనులను జెఱుపంగ బిల్లిపిల్ల
అందమునఁ గ్రోఁతిపిల్ల యీ యఱవపిల్ల.

శ్రీనాథుడు దక్షిణదేశమును పర్యటించుచు ద్రవిడాంగనల గూర్చి పై విధముగ పలికినాడు.

శ్రీనాథుడు పల్నాటి ప్రాంతమున పర్యటించుచున్నాడు. త్రోవలో దాహమైనది. నీరులేదు. కష్టముతోచి గరళకంఠునే ఇట్లన్నాడు.

సిరి గల వానికిఁ జెల్లును
దరుణుల పదియాఱువేలఁ దగఁ బెండ్లాడన్
దిరిపెమున కిద్ద రాండ్రా
పరమేశా! గంగ విడుము పార్వతి చాలున్.

ఈ పద్యమును మనమేగాదు పరమేశ్వరుడు విన్నను ఫక్కు-నవ్వును. అట్టిది అందలి చమత్కారము.

కొన్ని చాటువులు కవుల చరిత్రను, వారి ఆత్మీయతను వ్యక్తము చేయుచున్నవి. కృష్ణరాయల మరణము పెద్దనవంటి కవులకు గొడ్డలిపెట్టు. రాయలు గతించిన పిదప పెద్దన చెప్పిన పద్యము.

ఎదురైనచోఁ దన మదకరీంద్రము నిచ్చి
కేలూత యొసఁగి యెక్కించు కొనియె
మనుచరిత్రం బందుకొనువేళఁ బుర మేఁగఁ
బల్లకిఁ దనకేలం బట్టి యెత్తె
గోకట గ్రామాద్యనే కాగ్రహారంబు
లడిగిన సీమలయందు నిచ్చె
బిరుదైన కవిగండపెండేరమున కీవ
తగుదని తానె పాదమునఁ దొడిగె

ఆంధ్రకవితాపితామహ ! అల్లసాని
పెద్దన కవీంద్ర ! యని నన్నుఁ బిల్చునట్టి
కృష్ణరాయలతో దివి కేఁగలేక
బ్రదికి యున్నాఁడ జీవచ్ఛవంబ నగుచు.

పెద్దన జీవితమున కీ చాటువు సంగ్రహచరిత్ర. తాగా భువన విజయము ప్రాభవము నొందియున్న రోజులలో పెద్దన భోగలాలసత యెట్టిదో ప్రదర్శించు చాటువు.

నిరుపహతి స్థలంబు రమణీ ప్రియదూతిక తెచ్చియిచ్చు క
ప్పుర విడె మాత్మ కింపయిన భోజన ముయ్యెలమంచ మొప్పు త
ప్పరయు రసజ్ఞు లూహ తెలియంగల లేఖక పాఠకోత్తముల్
దొరికినఁ గాక యూరక కృతుల్ రచియింపు మనంగ శక్యమే.

ఆశువుగా కవిత చెప్పుమని కృష్ణరాయలడిగినట్లున్నాడు. అందులకు పెద్దన చెప్పిన సమాధాన మీ పద్దెము. ఒప్పు తప్పరయు రసజ్ఞులను, ఊహ తెలియంగల లేఖక పాఠకోత్తములను కవి కోరుకొనుట సహజమే. కాని ఆ నాటి పెద్దన కంత మాత్రము చాలినట్లు లేదు. మొదట పుష్టిగా భోజనము చేయవలెనట. పిదప ఊయెల మంచముపై ఊగుచుండవలెను. అప్పుడు కప్పురవిడెము కావలెను. ఆ కప్పురవిడెము తెచ్చి యిచ్చున దెవరు ? ఎవడో దూతగాడు పనికిరాడు. దూతి కావలెనట. ఆ దూతి యైనను ఏ యేబదేండ్ల వృద్ధురాలో కాకూడదు. జవ్వని కావలె సుమా యని సూచించుచు దూతికయన్నాడు. ఆ దూతిక జవ్వని గావచ్చును. కాని దాని ఆకారము కంటబడిన ఆంజనేయ దండకము చదివినను గుండెదడ తగ్గనిచో అంతయు వ్యర్థమే. అందులకే రమణీప్రియదూతిక యన్నాడు. అనగా ఏ వరూధిని వంటిదో కావలెను. ఈ సందర్భమున ఉండవలసిన స్థలము ? నిరుపహతి స్థలము. అనగా చుట్టుపట్టుల ఇతరు లెవ్వరు పారాడనట్టి చోటు. అతని దీక్షకు భంగము కలుగనట్టి ప్రదేశము. ఆత్మకింపయిన భోజనముచేసి ఉయ్యేల నూగుచు, ప్రక్కన రమణీప్రియదూతిక యిచ్చు కప్పురవిడెము విలాసముగ సేవించుచు, ఒప్పుతప్పరయు రసజ్ఞులు, ఊహ తెలియంగల లేఖక పాఠకోత్తములు ప్రక్కన సావధానులై యుండ అతడు కవిత్వము చెప్పునట. ఎంత భోగము! ఇవి ఆ నాటి కవులకు అలభ్య యోగములు కావు-విశేషించి పెద్దన వంటి వారికి. అంతటి భోగభాగ్యములు కూడి యున్నవి గనుకనే అట్టి ప్రబంధ కవిత పుట్టినది; పెద్దన, మనుచరిత్రవంటి శృంగార కావ్యము వ్రాయ గలిగినది. ఆకలి కవిత్వములు, ఏడుపు కవిత్వ ములు ఆనాడు లేవు. పూర్వ కవులకు ఆకలి లేదనిగాని, వారెన్నడు ఏడ్చి యెరుగరనిగాని భావముగాదు. ఆ కవులు తమ ఆకలిని ఏడ్పును కవిత్వమున ప్రవేశ పెట్టలేదనుటయే.

ఈ క్రింది పద్యము శ్రీనాథు డవసాన దశలో చెప్పినది.

కాశికా విశ్వేశుఁ గలిసె వీరారెడ్డి
రత్నాంబరమ్ము లే రాయఁ డిచ్చు ?
రంభఁ గూడెఁ దెనుంగు రాయరాహుత్తుండు
కస్తూరికే రాజుఁ బ్రస్తుతించు
స్వర్గస్థుఁడయ్యె విస్సన మంత్రి మఱి హేమ
పాత్రాన్న మెవ్వని పంక్తిఁ గలదు
కైలాసగిరిఁ బండె మైలారు విభుఁడేగి
దినవెచ్చ మే రాజు దీర్పఁగలఁడు.

భాస్కరుఁడు మున్నె దేవుని పాలి కరిగెఁ
గలియుగంబున నిఁక నుండఁ గష్ట మనుచు
దివిజ కవివరు గుండియల్ దిగ్గురనఁగ
నరుగు చున్నాఁడు శ్రీనాథుఁ డమర పురికి.

శ్రీనాథు డేయే ప్రభువుల ప్రాపు పొందినది, ఆ ప్రభువు లాతని నెట్లు సత్కరించినది ఈ చాటువున స్పష్టమగుచున్నది. అంతేగాక శ్రీనాథుని ఆత్మీయతలోని విశేషము గూడ ఇందు వ్యక్తమగును. శ్రీనాథునిది రాజస ప్రకృతి. ఒకవైపు కలియుగంబున నిక నుండుటయే కష్టమనిపించు దారిద్ర్య మనుభవించుచు, మరొకవైపు అవసాన దశలో నడుగు పెట్టుచు, దివిజకవివరు గుండియల్ దిగ్గురనగ అమరపురి కేగుదు ననుచున్నాడు. దివిజకవివరుని బహుశః రెండవ డిండిమభట్టుగా భావించె నేమొ. తనయంతటి మహాకవి స్వర్గమున అడుగుపెట్ట అటనున్న కవికి గుండె లదర వలదా ? యని శ్రీనాథుని భావన. అట్టిది అతని రాజసము.

శ్రీనాథుని ఆత్మీయతలోని మరొక విశేషము అనుభవ రాసిక్యము, ఆ విశేషమును దెలుపు చాటువు.

అక్షయ్యం బగు సాంపరాయని తెలుంగాధీశ ? కస్తూరికా
భిక్షా దానము సేయురా సుకవిరాడ్బృందారక శ్రేణికిన్
దాక్షారామ చళుక్యభీమ వర గంధర్వాప్సరో భామినీ
వక్షోజ ద్వయ కుంభి కుంభములపై వాసించుఁ దద్వాసనల్.

శ్రీనాథుడు కర్ణాటాంధ్ర క్షితీశ్వరుడగు సంబుపరాయని తెలుంగు రాయలకడ కరిగి అతని నాశీర్వదించినాడు. ప్రభువు ప్రీతుడైనాడు. ఇక శ్రీనాథుం డాతనిని యాచించినది ? అగ్రహారములుగాదు; దుకూలములు గాదు; మడిమాన్యములుగాదు. కస్తూరి. కాని కస్తూరి ఎందులకు ? దాక్షారామ చళుక్యభీమ వరగంధర్వాప్స భామినీ వక్షోజ ద్వయకుంభి కుంభములపై వాసించు దాని వాసనలను బట్టి ప్రయోజన మూహ్యము.

చారిత్రక విషయములకు గూడ ఛందస్సు తొడిగి చెప్పుట ఆంధ్ర దేశమున నొక యాచారము. క్రీ. శ 1550 తరువాత ఆంధ్రదేశమును పాలించిన మల్కిభరా మను తురుష్క ప్రభువు విజయపరంపరను దెలుపు చాటువు.

ధాటిగ నేఁగి యుద్దగిరిఁ దార్కొని వేంకటరాజుఁ దోలి ముం
గోటల లగ్గపట్టి వినుకొండయు బెల్లముకొండ తంగెడల్
పాటిమెయిన్ హరించి మఱి బల్మిని గైకొనెఁ గొండవీడుఁ గ
ర్ణాట రాజధాని యిభరాముడు బాహు బలంబు మీఱఁగన్.

అల్లే మట్లరాజు తిరువేంగళనాథుని పరాక్రమమును ప్రదర్శించు చాటువు.

వెండియు మల్లరాజు తిరువేంగళనాథుఁడు కందనోలికా
ఖండన భూమిలోఁ దురక బారులపైఁబడి సంహరింపఁగాఁ
గండలు కొండ లయ్యె నెముకల్ ధరణీజము లయ్యె నెత్తురుల్
గందపు టేఱులయ్యెఁ దలకాయలు తారక లయ్యెఁ జూడఁగన్.

ఈ చారిత్రక విశేషముల దెలుపునట్టి చాటువులు అతిశయోక్తుల కాలంబనములు, ఉత్ప్రేక్షల కునికిపట్టులు, కల్పనలకు పట్టుగొమ్మలు. సత్యశోధనాదిదృక్షువులైన చరిత్రకారులు మట్టినుండి బంగారును వేరుచేసినట్లు వాని నుండి వాస్తవికతను గ్రహింప వలసి యుండును.

సాంఘిక విషయములు కొన్ని చాటుపద్యములలో ప్రతిఫలించుచున్నవి. సాంఘిక చరిత్రకు శ్రీనాథుని చాటువులు చాల ఉపయుక్తములు. శ్రీనాథునివలె బహుప్రదేశములను, ప్రజలను, ప్రభువులను సందర్శించిన కవులు చాల తక్కువ. ఒకవేళ వెళ్ళి చూచినను ఆ ప్రదేశములను ప్రజలను వారి ఆచార వ్యవహారములను అరమరలులేక అంత నిర్దుష్టముగ విమర్శించి వర్ణించిన కవులు లేరనియె చెప్పవచ్చును. శ్రీనాథుడు కర్ణాటదేశమును పర్యటించి అచటి ప్రజల వేషమును వారి ఆహార విశేషములను తెలియజెప్పిన పద్యము.

కుల్లా యుంచితిఁ గోఁక సుట్టితి మహాకూర్పాసముం దొడ్గితిన్
వెల్లుల్లిం దిలపిష్టమున్ మెసవితిన్ విశ్వస్త వడ్డింపఁగా
చల్లా యంబలి ద్రావితిన్ రుచులు దోసం బంచుఁ బోనాడితిం
దల్లీ ! కన్నడరాజ్యలక్ష్మి ! దయలేదా నేను శ్రీనాథుడన్.

వేమారెడ్డి, వీరభద్రారెడ్డి ప్రతివత్సరము సింహాచలమున తిరునాళ్లు జరిపింతురు. శ్రీనాథుడు వారివెంట నా యుత్సవమునకేగి ఆ పర్వతము

పైకి యాత్రార్థము వచ్చు వివిధ జాతుల స్త్రీల నందరను వర్ణించినాడు. ఆనాటి స్త్రీల అలంకరణలు, ఆకార విశేషములు ఆ వర్ణనలలో వ్యక్తమగుచున్నవి.

పలనాటిని గూర్చిన శ్రీనాథుని పద్యములు ప్రసిద్ధములు. అవి ఆ ప్రాంత స్వరూపమును పాఠకులకు ప్రత్యక్షము సేయగలవు.

రసికుడు పోవఁడు పల్నా
డెసగంగా రంభయైన నేకులె వడకున్
వసుధేశు డైన దున్నును
గుసుమాస్త్రుం డైన జొన్నకూడే కుడుచున్.

ఆనాటి పల్నాడు అంత అనాగరక ప్రదేశము. అంతేగాదు.

అంగడి యూర లేదు వరి యన్నము లేదు శుచిత్వ మేమి లే
దంగన లింపు లేరు ప్రియమైన వనంబులు లేవు నీటికై
భంగపడంగఁ బాల్పడు కృపాపరు లెవ్వరు లేరు దాత లె
న్నంగను సున్న గాన పలనాటికి మాటికిఁ బోవ నేటికిన్.

పలనాటిలో ఒకరింట శ్రీనాథునికి జొన్నకూడును, చింత చిగురు బచ్చలాకు కలిపి వండిన యుడుకుకూరను వడ్డించిరట. శ్రీనాథున కా భోజనము పడగనే కడుపునుండి కవిత్వము పుట్టినది.

పుల్లసరోజనేత్ర, యల పూతన చన్నుల చేఁదు ద్రావి నాఁ
డల్ల దవాగ్ని ద్రింగితి నటంచును నిక్కెదవేల? తింత్రిణీ
పల్లవ యుక్తమౌ నుడుకు బచ్చలి శాకము జొన్నకూటితో
మెల్లన యొక్కముద్ద దిగమ్రింగుమ, నీ పస కాననయ్యెడిన్.

ఆనాటి ప్రజల ఆహార మిట ప్రదర్శింపబడినది. సుకుమార హాస్య గర్భితమైన శ్రీనాథుని విమర్శ సహృదయ హృదయరంజకము. అది విని తిట్టు తిన్నవాడు గూడ తలయూచి నవ్వగలడు. పలనాటి తిండి తిని చూడు మని శ్రీకృష్ణునితో సవాలు చేసిన శ్రీనాథుడు. రేనాటి తిండి తినుమని పరమేశ్వరుని బెదిరించుచున్నాడు.

గరళము మ్రింగితి నంచుం
బురహర ! గర్వింపబోకు పో ! పో ! పో ! నీ
బిరుదింకఁ గానవచ్చెడి
మెఱసెడి రేనాటి జొన్న మెదుకులు దినుమీ.

మసరరాజ్యమును గూర్చియు పడమటిసీమ వ్యాపారులను గూర్చియు, దక్షిణదేశ ద్రావిడులను గూర్చియు, రెడ్లరాజధానియైన అద్దంకిని గూర్చియు శ్రీనాథుడు చెప్పిన చాటువు లా యా ప్రదేశము లందలి విశేషముల తెలుపునట్టివే. మీదు మిక్కిలి సునిశిత హాస్యశోభితములు.

పూర్వము కరణములు జమాబందీలకు వెళ్ళుట, అట వసతులు లేక వారు అవస్థపడుట, ఒక చాటువు చెప్పుచున్నది. నారయప్పారావుగారి సంస్థానమున జమాబందీకి వచ్చిన కరణములతో నూజివీట నివశించు క్లేశమును భరింపలేక కరణ మొకడు నారయ భూపాలుని కిట్లు విన్నవించు కొన్నాడు.

శీతల జల స్నానంబును
భూతల శయనంబు నొంటిపూ టశనంబున్
నాతి గల బ్రహ్మచర్యము
నాతరమా ! పూట గడప నారయభూపా.

ఈనాటి వసతి గృహములు ఆ క్లేశముల నన్నింటిని తీర్చుచున్నవి గదా.

పూర్వము "అర్జీలు" గూడ పద్యములలో వ్రాయుట ఆచారము. పూసపాటి విజయరామరాజు అడిదము వారికి రేగమాన్య మిచ్చినాడు. దంతలూరి అన్నమరాజు ఆ మాన్యమున కాటంకములు గలిగింప అడిదము రామకవి పూసపాటి ప్రభువున కిట్లు పద్యములలో "అర్జీ" వ్రాసినాడు.

అవధారు ? దేవ ! మహాప్రభూ ! విన్నపం
బాశ్రితోత్తముఁడ శుద్ధాంధ్ర కవిని
పేరు రామన యింటిపే రడిదమువారు
మా జాగ భూపాలరాజు రేగ
.... .... .... .... ....
.... .... .... .... ....

అతని అర్జీలోని "ఏ జోలికినిఁ బోక యింట నుండుద మన్న సాలుకు వచ్చు గంటాల పన్ను" అను వాక్యమును బట్టి ఆనాడు కవులు వ్రాసికొను గంటములపై సాలునకు పన్ను గల దను విశేషము వ్యక్తమగును.

చాటువులలో కొన్ని సరసమైన సమస్యలున్నవి. "కుంజరయూథమ్ము దోమ కుత్తుక జొచ్చెన్" అను రామకృష్ణున కిచ్చిన సమస్య ఆంధ్రప్రజల నుఱ్ఱూత లూగించినదే. అట్టివే ఒకట్రెండు—

"కన్నులలోఁ జన్ను లమరెఁ గాంతామణికిన్"

చిన్నవి ఝషకంబులు గొని
చెన్నలరఁగ బెస్తవారి చిన్నది రాఁగాఁ
బన్నుగ ఱొమ్మునఁ గల వల
కన్నులలోఁ జన్ను లమరెఁ గాంతామణికిన్.

"ఎలుకలు తమ కలుఁగులోని కేనుఁగు నీడ్చెన్"

ఇలలో నిద్దఱు రాజులు
మలయుచుఁ జదరంగ మాడి మాపటివేళన్
బల మెత్తి కట్ట మరచిన
ఎలుకలు తమ కలుగులోని కేనుఁగు నీడ్చెన్"

ఇవి నెల్లూరు మండలములోని తెట్టు నివాసియైన మోచర్ల వెంకన్న వేంకటగిరి రాజుకడ పూరించినవని ప్రతీతి.

ఇతివృత్త గౌరవము కావ్యలక్షణమని జెప్పినట్లే ఇతివృత్త లాఘవము చాటుపద్య లక్షణమని చెప్పవచ్చును. అనగా ఎంత అల్ప విషయమైనను చాటుకవిత కాలంబన మగును. ఆయా వస్తువులలోని ఏదో ప్రత్యేకమైన వెలుగు కవి హృదయమును సోకినపుడు నిసర్గసుందరమైన కవిత వెల్లి విరియును. గొప్పవిషయములు చెప్పవలెనను కాంక్ష ఈ కవుల కుండదు. కాని చమత్కారమే ఈ రచనలకు జీవము. ఒక చాటు కవి కడకు నల్లి నిగూర్చి పద్య మల్లి నవ్వించినాడు.

శివు డద్రిని శయనించుట
రవి చంద్రులు మింట నుంట రాజీవాక్షుం
డవిరళముగ శేషుని పైఁ
బవళించుట నల్లి బాధ పడలేక సుమీ.

ఇట్లే ఎలుకను గూర్చియు, పిల్లిని గూర్చియు, పొగాకును గూర్చియు, అత్తింటి కోడలిని గూర్చియు, వలపును గూర్చియు, చలిని గూర్చియు చమత్కార భరితములైన చాటువు లున్నవి.

ఎంగిలిచుట్టను త్రాగువాని నెవడో ఎగతాళి చేసినట్లున్నాడు. అందులకాతడొక ధర్మసూక్ష్మము చెప్పినాడు.

పొగక్రోవికి సతి మోవికి
నగణితముగ నూరబావి కమృతమునకున్
దగ నుచ్ఛిష్టత లేదని
ఖగవాహనుతోడఁ గాలకంఠుడు పల్కెన్.

ఇంత గొప్పధర్మసూక్ష్మము తాను దెలుపుట గాదట. విష్ణుమూర్తి యంతటి వానితో విరూపాక్షు నంతటివాడే చెప్పినాడట. ఎంత గడుసుదనము.

సామాన్యముగ కవులు కీర్తిప్రియులు. ప్రతి కవికి కవితమీద తన కర్తృత్వ ముద్ర యుండవలెనను కాంక్ష యుండును. కాని చాటు కవితల కర్తృత్వములు నిష్కర్షగ నిర్ణయించుటకు వీలు లేనివి. వీటిని ఏ కవి చెప్పెనో ఎప్పుడు చెప్పెనో ఎందులకు చెప్పెనో తేల్చి చెప్పుట చాల కష్టము. కొందరి పేరనున్న పద్యములు ఆ కవులు తమ వని తెలుపుకొన్నవి గావు. శైలిని బట్టియు, సందర్భమును బట్టియు ఊహించి ఆ యా కవుల కంట గట్టబడినవే. ఇవి ఎట్టి పేరు ప్రతిష్ఠలు అపేక్షింపని స్వచ్ఛమైన కవితలు; కవులు కవితగాకరగిపోయిన ఘట్టములు. నిబద్ధ కావ్యములైన ప్రబంధము లందలి పద్యములు సంఘబలముతో బ్రతుకుచున్నవి. ముక్తకములైన చాటుపద్యములు పుట్టుబలముతోడనే కాల మహాస్రవంతి కెదురీది బ్రదికినవి.

చాటు కవితలు చాలకాలము జనశ్రుతియే జీవనాధారముగ నిలిచినవి. వానిని గ్రంథరూపమున గూర్చినట్టి వేటూరి ప్రభాకర శాస్త్రిగారు; దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు ఆంధ్ర రసజ్ఞులకు అభినందనీయులు.

★

# మహాకవి ధూర్జటి

ప్రబంధకవులలో పెక్కుమంది ప్రతిబింబములు; ప్రతిధ్వనులు. వారు అటు మహారాజు అభిరుచులను ఇటు మహాకవుల అడుగుజాడలను అనుసరించినారు. కాని ధూర్జటి వ్యక్తిత్వమున్న మహాకవి. స్వతంత్ర ప్రకృతి గల ప్రతిభావంతుడు. అతి స్వతంత్రమైన ప్రకృతి. అచంచలమైన శివభక్తి, ఈతని ఆత్మీయతకు జీవనాడులు. ప్రతి పద్యమునందును వాని స్పందనము సహృదయమున కనుభూతమగును.

కృష్ణరాయలు వైష్ణవుడు. ఆముక్తమాల్యద కరుడు గట్టిన అతని వైష్ణవ భక్తికి పతాక. ఆ కాలమున పెద్దనవంటి మహాకవి మొదలు పద్యమల్లగలిగిన పిల్లకవి వరకు వైష్ణవమును గౌరవించినవారే. కొందరు ముద్రిత వైష్ణవులు-మరికొందర ముద్రిత వైష్ణవులు. అట్టి పరిస్థితులలో వైష్ణవము నాదరించని మహాకవి ధూర్జటి. ఈతడు వైష్ణవము నాదరించ లేదు సరిగదా మీదుమిక్కిలి శైవమును స్వీకరించినాడు. అష్టదిగ్గజములలో నొకడై భువనవిజయము నలంకరించినను పరమ వైష్ణవుడైన ప్రభువు ఎదుట పరమేశ్వర భక్తుడుగనే పీఠ మలంకరించినాడు. కృష్ణరాయల సార్వభౌమత్వమును జూచిగాని అతని సాహితీపోషకత్వమును జూచిగాని తన శైవమును చల్లబరచుకొని మొగమోటమున కైన వైష్ణవముతో సంధి చేసికొనని వ్యక్తి ధూర్జటి. వేలకొలది ఊర్ధ్వపుండ్రముల నడుమ ధూర్జటి విభూతి రేఖలు విశిష్టతను నిలుపుకొన్నవి, పెద్దన, తిమ్మన మొదలైన

మహాకవులు మనుచరిత్ర పారిజాతపహరణాది శృంగార ప్రబంధములవ్రాయ ధూర్జటి కేవలము శివభక్తిని చాటునట్టి శ్రీ కాళహస్తి మహాత్మ్యమును తీర్చిదిద్దినాడు. పైగా అది ఆముక్తమాల్యదకు ప్రత్యర్థి వంటిది. అంతేగాక పెద్దనాదులు కృష్ణరాయలను కృతిభర్తనుజేయ ధూర్జటి ఆ గౌరవమును కాళహస్తీశ్వరునికే కట్టబెట్టినాడు. ధూర్జటి చరమ దశలో శతకము వ్రాసెనని పండితాభిప్రాయము. అట్లుగాక ఆ శతకము భువనవిజయముననే పుట్టియున్న అది యాతని వ్యక్తిత్వముపై నింకను వెలుగులు ప్రసరించ గలదు.

గ్రంథములందలి వ్యాకరణ విరుద్ధప్రయోగములు, పరభాషాపద ప్రయోగములు ఈతని స్వతంత్రతను దెలుపు చిహ్నములే. కాగా నత్కీరోపాఖ్యానమున ఈతని స్వతంత్ర ప్రకృతి మరికొంత స్పష్టమగును. నత్కీరుడు మహాకవి. స్వతంత్రప్రకృతి గల వ్యక్తి. అట్టివాడు ధూర్జటికి ఆత్మీయుడే. ఇద్దరును తాము నమ్మిన సత్యమును తడబాటు లేక మహేశ్వరు డడ్డువచ్చినను మొగమాట పడక, లాభనష్టములను లెక్కచేయక, కుండ బ్రద్దలు కొట్టినట్లు చెప్పగలిగినవారే. నిజము చెప్పునపుడు నీళ్ళు నమలుట వీరి చేతగానిపని. హరద్విజుడు దెచ్చిన ఈశ్వరుని పద్యమున "సింధురాజగమనా ధమిల్ల బంధంబు సహజగంధం" బను పాదము తప్పనియు, అది కవితా సమయమున కొప్పు గాదనియు నత్కీరుడెదిరింప పరమేశ్వరుడే ప్రత్యక్షమై "గిరితనయా కచభారంబు సహజ గంధం" బని పునరుద్ఘాటించినాడు. అప్పుడు నత్కీరుడు "గగనప్రసూనవాదము జగతిం బ్రత్యక్షమునకు సరియన దగునే" అని యనుటయు, మరల ముక్కంటి మూడవ నేత్రమును జూపి బెదరింప మూడు కన్నులు గాదుగదా—

తల చుట్టు వాఁడిఁ గన్నులు
గలిగినఁ బద్యంబు దప్పు గాదన వశమే

వల దిచ్చుట నీ మాయా!
విలసనములు పనికిరావు విడువుము—"

అను వాక్యములు ఆ మహాకవి స్వతంత్ర ప్రకృతికి ధ్వజప్రాయములు. ఇట నత్కీరునికి బదులు ధూర్జటిని నిలిపినను పాకము తగ్గకుండ పరమేశ్వరుని మీద ఆ పలుకులనే విసరగలడు. అట్టిది ధూర్జటి వ్యక్తిత్వము. ఆట పాండ్యరాజు సభలోని పన్నిద్దరు కవులకు, అందలి నత్కీరునికి, అతని ప్రకృతికి — ఇట కృష్ణరాయల కొలువులోని అష్టదిగ్గజములకు, అందలి ధూర్జటికి, ఆతని ప్రకృతికి స్పష్టమైన సామ్య ముండుట సహృదయ విదితమే.

అచంచలమైన శివభక్తి ధూర్జటి వ్యక్తిత్వములోని మరొకవిశేషము. ఈతని శివభక్తి విపరీత పరిస్థితులకు వెనుకాడనట్టిది. వైష్ణవము దేశమున ప్రబలియుండ, తన ప్రభువు విష్ణుభక్తుడైయుండ, సహవ్రతులు వైష్ణవ మును సత్కరించుచుండ ఈతని హృదయమున శివభక్తి వెల్లివిరిసినది. కవులలో ననేకులు భక్తులు లేకపోలేదు. కాని వారిలో పెక్కుమంది తమ దేవునకు కొబ్బరికాయలు కొట్టి కావ్యములను రాజుల కర్పించినట్టివారే. బహుజన్మతపఃఫల మనదగిన కవితాకళను పులకాంకుర ప్రకరములతో పరమేశ్వరున కర్పించిన మహాభక్తుడు ధూర్జటి. ఈతని శరీరమున ప్రత్యణువు శివాలయమే. ఈతిని చూపున ప్రకృతి సర్వము శివపూజా తత్పరమే.

ఆనాటి కవులు సాహిత్యమున శృంగారరసమునకు పట్టాభిషేకము చేసినారు. కారణము–అది ప్రజలకు విశేషించి ప్రభువులకు ప్రియతమ మగుటయే. అట్టి పరిస్థితులలో దన కావ్యమున భక్తికి పట్టము గట్టిన

శివభక్తుడు ధూర్జటి; అట్లు చేయుట అచంచలమైన శివభక్తికే గాక అతి స్వతంత్రమైన అతని ప్రకృతికి గూడ ఉత్తమమైన ఉదాహరణ.

ఒక వ్యక్తియొక్క వ్యక్తిత్వము వయస్సు గడచు కొలది, చెట్టు మీది పిందె కాయగా పిదప పండుగా పరిణమించునట్లు మార్పునొందగలదు. నిర్వచనోత్తరరామాయణరచననాటి తిక్కనకు భారత రచననాటి తిక్కనకు ఎంతో అంతర మున్నట్లు ప్రబంధ రచన నాటి ధూర్జటి శతకరచన నాటి ధూర్జటికి ఎంతో భేద ముండుట పండిత విదితమైన విషయము.

ధూర్జటి జీవితమును త్రిధా విభజింపవచ్చును. మొదటిది భువన విజయమును ప్రవేశించుటకు పూర్వపుదశ. రెండవది భువనవిజయమందలి దశ. మూడవది కృష్ణరాయలు గతించిన తరువాతి దశ. స్వతంత్ర ప్రకృతికి శివభక్తికిదోడు ఈతనిలో మూడు విశేషములు కప్పించును. అవి-కవిత్వము, రాజాశ్రయ కాంక్ష, భోగలాలసత. ఈ మూడింటను పై మూడు దశలలో గలిగిన పరిణామ మాతని వ్యక్తిత్వమును కొంతకు కొంత స్పష్టము సేయగలదు.

ధూర్జటి ఉత్తమ వంశమున ఉద్భవించినవాడు. బాల్యమున నీతడు సంస్కృతాంధ్రముల నభ్యసించి సమగ్రమైన పాండిత్యమును సంపాదించుట సహజమే. పుట్టుకతో వచ్చిన ప్రతిభ, పరిశ్రమించి గడించినపాండిత్యమును తోడుగా గొని కవిత్వ రచనకు దారి తీసినది. పద్య మల్ల గలిగిన "ప్రక్కరోజే" ధూర్జటి కృష్ణరాయల కొలువుకూటమున కాలు పెట్టియుండడు. అంతేగాక ఈతని కవిత్వము గూడ హఠాత్తుగా నొక్కమారు ప్రబంధ రూపమును దాల్చి వెలువడుటయు అసంభవమే. కాని తొలి రోజులలో ఈతడల్లిన పద్యములుగాని, వ్రాసిన గ్రంథములు గాని లెక్క

లోనికి రాక కాలగర్భమున కలిసి యుండును. సామాన్యముగ కవుల తొలి రచన లన్నియు ఇట్టి దురదృష్ట జాతకము కలిగినట్టివే. ఇక శివ భక్తుడైన ధూర్జటిని కృష్ణరాయలు చేరదీసి అష్టదిగ్గజములలో నొక్కనిగా ఆదరించుటకు అతని కమ్మని కవిత్వము తప్ప వేరు కారణ ముండుటకు వీలులేదు. భువనవిజయమును ప్రవేశించుటకు ముందే ధూర్జటి కవిగా గడించిన కీర్తి కృష్ణరాయల చెవి సోకియుండును. శైవుడైన ధూర్జటి అష్టదిగ్గజములలో నొక్కడగుటకు అంత మాత్రము చాలదు. కవియైన కృష్ణరాయలు ధూర్జటి కవనమును స్వయముగ చవిచూచి తన్మయుడై తలయూపి తగుదు వని అతనిని దిగ్గజముగా నిలిపి యుండును. అట్లు చేయుటలో ధూర్జటి శివభక్తి ఆ రసిక సామ్రాట్టున కడ్డురాలేదు. ధూర్జటి అష్టదిగ్గజములలో నొకడగుటకు కీర్తి, కవిత్వమేగాక అతడు కృష్ణరాయల యెదుట ప్రదర్శించిన అనుభావము గూడ తగిన రీతిని దోహదము చేసి యుండును. ఇక ధూర్జటి రాజాశ్రయ కాంక్ష సంగతి. ఆశ్రయము లేక వర్ధిల్లని వానిలో కవిత యొక టనుట క్రొత్త మాట గాదు. ధూర్జటి కవిత గొప్పదని నమ్మి, దాని నారాధించుచు ఆ యుగధర్మము ననుసరించిగాని తన వైయక్తిక పరిస్థితుల ననుసరించి గాని తగిన రాజాశ్రయము కొరకు తిరిగి యుండును. ఆనాడు రాజాశ్రయముపొంది రాణించవలె ననుకొనుట సర్వకవి సామాన్యమైన కోరిక. ధూర్జటి రాజాశ్రయ కాంక్ష చవి చూచిన మొదటి రాజు కృష్ణరాయులై యుండడు. ఆ తొలి రోజులలో ధూర్జటి కొందరు రాజుల కొలువు చేరి కొంతకాలము భోగముల ననుభవించి యుండును. అతనికి తృప్తి నిచ్చునట్టియు, స్థిరమైనట్టియు రాజాశ్రయము భువనవిజయమును ప్రవేశించుటకు పూర్వము లభించినట్లు లేదు. పైగా ఆ రాజుల అరసికత, ఐశ్వర్య మదాంధత, అధికార క్రూరత ధూర్జటి మనస్సున ముసలితనము వచ్చినను మఱపురాని కాల్లు వేసినట్లు

ఈ వాక్యమునకు శతకమందలి రాజదూషణ సాక్ష్యము. ఆ రాజదూషణ కేవలము కృష్ణరాయలను జూచిగాని అతని సమకాలీన అర్వాచీన ప్రభువులను జూచిగాని చేసినదై యుండదు. అందుకు పునాది అతడు భువన విజయమును ప్రవేశించుటకు పూర్వమే పడియుండవలెను. భువన విజయమును ప్రవేశించు నాటి ధూర్జటికి అవనిపతుల మీద అసహ్యమున్నను ఆస్థానములమీది ఆశ నశించలేదు. సాహితీ సమరాంగణ సార్వభౌముని స్వాగతము తనకు లభించినది. తృప్తి నిచ్చునని స్థిరమైన దని అతని కొలువుకూటమున కాలు పెట్టినాడు.

శతకమును, ప్రబంధమును చదివినపుడు ధూర్జటి భక్తుడుగనే కాక భోగిగ గూడ పొడగట్ట గలడు. శతకమందలి పద్యములు, ప్రబంధమందలి వర్ణనలు ఈతని శృంగార ప్రకృతికి సూచికలు. భువనవిజయమును ప్రవేశించుటకు పూర్వమే ధూర్జటి భోగానుభవముల మీద కాంక్షయున్నవాడుగ కన్పించును. అట్టి కాంక్షయే లేనిచో పోతనామాత్యుని వలె ఈ మహాభక్తుడుగూడా మడి దున్నుకొని బ్రదికి యుండును. భోగములు ఎండమావులని యెంచి మొదటి నుండియు వెంబడించనివాడు పోతన. విషయసౌఖ్యముల వెంబడించి విరక్తి జెంది వెనుదిరిగినవాడు ధూర్జటి.

ధూర్జటి స్వతంత్ర ప్రకృతిగల వ్యక్తిగ, శివభక్తుడుగ, కవితారాధకుడుగ, రాజాశ్రయాభిలాషిగ, భోగలాలసుడుగ భువనవిజయమును ప్రవేశించినాడు. కవిత చాల గొప్పదని నమ్మి కొలువుకూటమున కాలు పెట్టిన ధూర్జటి, కొలువున నున్నంతకాలము ఆ కళలో శిఖరముల నందుకొనుటకు శ్రమించుట సహజము. తన కవనమును గూర్చి కృష్ణరాయలే "స్తుతమతియైన ఆంధ్రకవి ధూర్జటి పల్కులకేల గలిగె నీ యతులిత మాధురీ మహిమ"యని భువనవిజయమున పదిమంది యెదుట ప్రశంసించు

నట్లు చేసినాడు. అంతేగాక భువనవిజయమున నున్న రోజులలో మహా భక్తుడైన ధూర్జటికి మహేశ్వరు నర్చించుటకు కవితయే ఉచితమైనదని యనిపించినది. అతని భక్తి కవిత్వరూపమున కైమోడ్పు ఘటించినది. శ్రీ కాళహస్తిమాహాత్మ్య ప్రబంధము ప్రొద్దుపొడుపు చూచినది. కవికి గండపెండేరము లభించిన ఆ కాలమున ధూర్జటికి కవనముమీద గౌరవము పెరుగుట వింత గాదు. ఇక అతని రాజాశ్రయ కాంక్ష విషయము: ధూర్జటికి లభించినది సామాన్యమైన రాజుల కొలువు కూటము గాదు. కటకము మొదలు కన్యాకుమారి వరకు తన బాహువీర్య తేజమున జయించి, కాలికి గండపెండెరము తొడిగి కవిని తన దేశమున మహా నాయకునిగా నిలువబెట్టిన వాడు కృష్ణరాయలు—సాహితీ సమరాంగణ సార్వభౌముడు. అట్టివాని ఆస్థానమున ధూర్జటికి దిగ్గజ గౌరవము లభించినది. ధూర్జటి రాజాశ్రయ కాంక్ష అంతకంటె పొందదగిన ఫలమే మున్నది? అంతటి రాజాశ్రయ కాంక్ష యున్నను, ఆ కాంక్ష అంత తృప్తికరముగ తీరినను, రాజకీయముల మీదను, రాజుల స్వభావముల మీదను ధూర్జటికి మొదటి నుండియు నున్న ద్వేషము భువనవిజయమున పోయినట్లు కన్పించదు. మీదు మిక్కిలి క్రమముగ అతిశయించినదేమో. అసాధారణ గుణోపేతుడైన కృష్ణరాయలు గూడ అతని కంటి కాగలేదు. పెద్దనాదుల వలె గాక ధూర్జటి తన ప్రబంధమును పరమేశ్వరున కంకిత మిచ్చినాడు. ఆ గ్రంథమును గాకున్నను కృష్ణరాయ లాతని కంటి కాగి యున్నచో మరొక గ్రంథమునైన ఆ మహాకవి వ్రాసి కృతి యిచ్చి యుండును. బహుశః కవిత్వము నరాంకితము చేయగూడదను నియమ మున్న దేమో. ఇక ధూర్జటి భోగ లాలసత: కృష్ణరాయల కొలువు చేరుటకు పూర్వము, చేరిన పిదప కొంతకాలము, ఈతడు విషయ సౌఖ్యముల విరివిగ అనుభవించి యుండును. "భువనైక మోహ నోద్ధత సుకుమార

వార వనితా జనతా ఘన తాప హారి సంతత మధురాధ రోదిత సుధారస ధారల గ్రోలుటం జూమీ" అని ధూర్జటికి కమ్మని కవన మబ్బిన కారణమును దెలుపు చాటువు భువనవిజయమున నున్న రోజులలో అతని శృంగార ప్రకృతిని ప్రదర్శించు చున్నది. "కాయల్ గాచె వధూ నఖాగ్రములచే గాయంబు" అను శతక మందలి పద్యము గూడ ఈ విషయమును బల పరచు నట్టిదే. అంతేగాక ఆనాటి యుగధర్మము గూడ అట్టిదై యున్నది. అవి ఆంధ్రదేశమున భోగములు ప్రభవిల్లిన రోజులు. రాయల యుగమున ప్రతి వ్యక్తియందును, సంఘ మందును, సారస్వత మందును, భక్తి శృంగారములు ప్రక్క ప్రక్కన గంగా యమునలవలె ప్రవహించి యున్నవి. పెద్దనగారి వరూధినీ ప్రవరుల ఘట్టము ఆనాటి సంఘమునకు సరసమైన వ్యాఖ్యానము. ఆనాటి సంఘమున వేశ్య విశిష్టమైన వ్యవస్థ. వేశ్యా సాంగత్యము సాంఘిక ద్రోహము గాదు. మీదుమిక్కిలి అది రాసిక్యమున కొక లక్షణముగా రాణించినది. భోగమయ మైన ఆ యుగ ప్రవాహమున చాల మంది కొట్టుకొని పోయినారు. వ్యక్తిత్వమున్నవాడు గనుక ఆ ప్రవాహమున పడినప్పటికిని ప్రక్కకీడి తప్పించుకొని తన ప్రభావమును సంఘముమీద ప్రసరింపజేసిన ప్రతిభావంతుడు ధూర్జటి. భువనవిజయమున నున్న కాలముననే క్రమ క్రమముగ అతని దృష్టి క్షణికములు నిస్సారములు నైన భోగముల నుండి పూర్తిగా భక్తివైపు మరలినది. ధూర్జటి అంతరంగమున శృంగార స్రవంతి భక్తిప్రవాహమున సంగమించినది గాని, భక్తి ప్రవాహము శృంగార స్రవంతిలో సంగమించ లేదు. అందుచేతనే ఆ యుగమున ధూర్జటిది విశిష్టమైన వ్యక్తిత్వము.

కృష్ణరాయలు గతించినాడు. భువనవిజయము శిశిరకాలపు రసాల వృక్షమైనది. ఆ సాహితీ సదస్సు నాశ్రయించి యున్న కవి పండితులు పక్షులవలె దిక్కుకొకరై చెదరి పోయినారు. అంతయు జూచిన ధూర్జ

హృదయమున ఐహికముల అస్థిరత్వము స్థిరముగ నాటుకొన్నది. ఏ తిమ్మరుసు కన్నులు ప్రసాదించి కృష్ణరాయలను ప్రభువుగ నిలిపినాడో ఆ తిమ్మరుసునే కృష్ణరాయలు కన్నులు పెరికించి కారాగారమున వేసినాడు. ఇట్టి ఘట్టములు కంటబడిన ధూర్జటికి రాజులమీది ద్వేషము ద్విగుణీకృతమగుట వింతగాదు. బహుశః అతడి జగన్నాటకమును జూచి చెంపలు వేసికొని చేతు లెత్తి శివునకు మ్రొక్కి చరమదశను యోగిగా గడపి యుండును. ఆ చరమ దశలో వ్రాసి నట్టిదే అతని శతకము.

భువనవిజయమున నుండి ప్రబంధము వ్రాయు నాటి ధూర్జటిలో భోగలాలసత కొంత సన్నగిల్లిన దేమొ గాని, రాజాశ్రయ కాంక్ష కొంత తగ్గిన తగ్గిన దేమొ గాని, కవిత్వముమీది గౌరవము మాత్రము కొరత వడలేదు. శతక రచన నాటి ధూర్జటిలో భోగలాలసత పూర్తిగ పోయినది. రాజాశ్రయ కాంక్ష ఊచముట్టుగ ఊడిపోయినది. పైగా రాజుల మీది ద్వేషము ప్రత్యణువునకు ప్రాకి పోయినది. వీనికి దోడు కవిత్వము మీది గౌరవము పోవుట, పండితుల మీద ద్వేషము ప్రబలుట ప్రత్యేకించి గమనింప దగిన యంశములు. భక్తుడై కాళహస్తీశు మహిమను ప్రదర్శించుటకు భువనవిజయమున ప్రబంధకవితను స్వీకరించిన ధూర్జటి శతకము వ్రాయునపుడు సత్యమును వర్ణింప కవిత చాలదని చాటినాడు. ప్రబంధము వ్రాయునపుడు ఆదరించిన అలంకారములను శతకము వ్రాయు నపుడు పేలవములని ప్రక్కకు నెట్టినాడు. భువనవిజయమున కవిని ఘను డని నమ్మిన ధూర్జటి శతకము వ్రాయునపుడు కవి నని చెప్పు కొనుటకే సిగ్గుచెందినాడు. సామాన్యముగ కవులు, యము డెదుట బడినను అసువులైన అర్పించుటకు వెనుదీయరు గాని కవితమీది వలపు మాత్రము వదలుకొనలేరు. భువనవిజయమున ప్రబంధము వ్రాయు నపుడు ధూర్జటి కంటికి పరమేశ్వరుని ప్రక్క మరొకటి కన్పించినది.

అది తన కవిత్వము. శతక రచననాటి ధూర్జటిలో ఆ కవితమీది గౌరవమే గాక, అహము గూడ అంతరించినది. "ఛీ లజ్జింపరుగాక మాదృశ కవుల్" అనుటలో ధూర్జటిమహాకవి శిరస్సువంటి కవిత్వమును గండకత్తెర వేసి పరమేశ్వరుని పాదములపై పడవేయుట ప్రత్యక్ష మగును. ధూర్జటిది సంపూర్ణమైన ఆత్మార్పణ. అతని కంటికి శివుడు తప్ప సర్వము చాటుపడినది. పోతన శ్రీరాముని యెదుట భక్తుడుగనే గాక కవిగ గూడ సాగిలపడినాడు. కాని ధూర్జటి శివుని సన్నిధిలో కేవలము భక్తుడుగ మాత్రమే నిలువగలిగినాడు. అతని వ్యక్తిత్వములో అంత మార్పు వచ్చినది.

అన్ని పౌరాణిక కథలవలె కాళహస్తి మాహాత్మ్య కథ గూడ కీళ్ళు సడలిన బొమ్మయే. విశేషించి ఇది క్షేత్ర మాహాత్మ్యమును దెలుపు కథ యగుటచే ఉపకథలు మెండుగ నున్నవి. క్షేత్ర మాహాత్మ్యమును, అట ముక్తినొందిన మహాభక్తుల చరిత్రను, అందు వ్యాప్తినొందిన మతవైశిష్ట్య మును, ప్రచారము సేయుటయే ఆ కథల ప్రధాన లక్ష్యము. కావ్యదృష్టి వానికి గౌణము. కాని ధూర్జటి మహాభక్తుడు మాత్రమే గాక మహాకవి గూడ నగుటచే ఆ కథలను వీలైనంత రసవంతములుగ తీర్చిదిద్దినాడు.

వసిష్ఠ మహాముని తపమునకు మెచ్చి పరమేశ్వరుడు ప్రత్యక్షమై అతనికి బ్రహ్మవిద్యోపదేశము చేసి తాను కాళహస్తిలో లింగాకారమున వెలసెనట. అగస్త్య మహాముని తపముచే ఆకాశగంగయే సువర్ణముఖీ స్రవంతిగ అవతరించినదట. అనగా కాళహస్తిలోని శివలింగము వసిష్ఠ తపఃఫలము; సువర్ణముఖి అగస్త్య తపఃఫలము. పుత్రహీనుడైన బ్రహ్మదేవుడుగూడ పరమేశ్వరుని గూర్చి యట తపస్సు చేసినాడు. లూతాకీటకము, కాళసర్పము, హస్తీశ్వరుడు, తిన్నడు, నత్కీరుడు, వేశ్యాకన్యలు ఆ క్షేత్రమున శివైక్యము నొందిన జీవులు. ఈ కథలన్నియు

పాఠకుడు తలయూప దగినవేగాని తర్కింప వలసినవిగావు. లింగోత్పత్తి, సువర్ణముఖీ జననము, బ్రహ్మతపస్సు-ఈ మూడు కథలును ధూర్జటిని పురాణ కవిగ పరిచయము సేయ శ్రీ కాళహస్తుల కథ, కన్నప్ప కథ. నత్కీరుని కథ, ధూర్జటిని ప్రబంధ కవిగ ప్రదర్శించు చున్నవి. పైగా ఈ కథ లన్నియు శివుని అనుగ్రహ ప్రభావమును దెలుప శ్రీకాళహస్తుల పూర్వజన్మ కథలు శివుని అనుగ్రహ ప్రభావమును పేర్కొనుచున్నవి. ధూర్జటి కథాకథన నైపుణి పతాక వంటిది కన్నప్ప పూర్వజన్మకథ. ఇది అనతివిస్తృతమయ్యు రస సముచితమై భారవి కిరాతార్జునీయమును క్రిందు సేయునట్లున్నది.

ఈ కథల లోని అంతర్వాహిని శైవభక్తి తత్వ ప్రచారము. శైవము ముగ్ధ భక్తికి ప్రాధాన్య మిచ్చినది. అభిజాత్యము, పాండిత్యము, ప్రతిభ మొదలగు వైయక్తికవిశేషములు పరమేశ్వరుని యెదుట పరిగణింపబడవు. నిర్మలమై అచంచలమైన భక్తియే ముక్తిసాధనము. అంతేగాక శివుడు భక్తితత్పరమైన హృదయమునే ప్రధానముగ నెంచును గాని బాహ్యాచారముల పరగణింపడు. పుక్కిట దెచ్చిన నీటితో శివలింగ మును శుభ్రముగ కడగి, వన్య మృగముల వేటాడి తెచ్చిన మాంసమును మహేశ్వరునకు మహానైవేద్యముగ పెట్టి, కడకు శివలింగముమీద కాలు మోపిన తిన్నడు తరించిన వృత్తమే ఇందులకు సాక్ష్యము. లూతాకీటకము మొదలు నత్కీర మహాకవి వరకును, వేశ్యాకన్య మొదలు ఉత్తమ బ్రాహ్మణుని వరకును భక్తియున్నచో శివసాయుజ్యమును సమానముగ పొందగల రనుట నీ కథలు ఘోషించుచున్నవి.

ధూర్జటి వ్యక్తిత్వము వలె అతని వర్ణనలు గూడ విశిష్టములే. చాల మంది కవుల చూపు స్థాలోకమును దాటి పోలేదు. అందుచే వారి వర్ణనల

చదువు నపుడు పాఠకుడు ప్రపంచమును దాటడు. కాని ధూర్జటి విషయ మట్లుగాదు. అతని దృష్టి విశ్వమంతటిని వ్యాపించ గలదు. అతని వర్ణనలు భావుకుని భూలోకపు పొలిమేరలనుండి దాటించగలవు. చంద్రోదయమును ఆంధ్రమున ఇంచుమించు అందరు కవులు వర్ణించినారు. ఆ వర్ణనలన్నియు నొక యెత్తు. ధూర్జటి వర్ణన ఒక్కటే ఒక యెత్తు.

ఉదయ గ్రావము పానవట్ట మభిషేకోద ప్రవాహంబు వా
ర్థి ధర ధ్వాంతము ధూప ధూమము జ్వలద్దీప ప్రభారాజి కౌ
ముది తారా నివహంబు లర్పిత సుమంబుల్ గాఁదమో దూర సౌ
ఖ్యద మై శీతగభ స్తి బింబ శివలింగం బొప్పెఁ బ్రాచీ దిశన్.

ఈ పద్యము-భక్తి, కవిత్వము సంగమించిన తీర్థము.

మహాభక్తుడైన ధూర్జటి విశ్వమంతటిని శివాలయముగా దర్శించి నాడు. తాను దర్శించుటయే గాదు. ఆ విశ్వేశ్వరాలయ ప్రతిబింబమును ప్రతి రసజ్ఞు హృదయమునను ప్రతిష్ఠించినాడు. ఇట కవి తాను పులకించి నాడు. సహృదయుల పులకింప జేసినాడు. ఈ పద్యము ధూర్జటి శివభక్తి యొక్క విశ్వరూప ప్రదర్శనమే.

అట్టిదే ధూర్జటి అసాధారణభావనా పరిధులను ప్రదర్శించు మరొక వర్ణన.

తిమిర దినేంద్రజా జలము దెచ్చి యజాండ ఘటంబునందుఁ బో
సి మరలఁ బశ్చిమాశ యను చెల్వ వహించిన పద్మరాగ కుం
భము గతి సూర్యుడుం జనియెఁ బ్రాక్సతి వెన్నెల వేల్పు చేటి తో
యము పడఁబోయు హేమకలశాకృతిఁ జంద్రుడు నొప్పెనయ్యెడన్

ఇందు సూర్యాస్తమయ చంద్రోదయములు వర్ణితములు. పశ్చిమ దిక్కను కాంతి నల్లని యమునా జలమును దెచ్చి బ్రహ్మాండ మను కుంభ

యందు బోసి మరల కటిపై వహించిన పద్మరాగ కుంభము అస్తమించు సూర్యబింబము. ప్రాగ్దిశ యను పడతి వెన్నెల యను మందాకినీ సలిలముల పడబోయు సువర్ణ కలశము ఉదయించు చంద్రబింబము. అస్తమించు సూర్యబింబ మెఱ్ఱగ నుండును గనుక దానిని పశ్చిమ దిక్కాంత వహించిన పద్మరాగ కుంభమునకు పోల్చుట. పసిడి కాంతుల ప్రసరించు చంద్ర బింబమును ప్రాగ్దిశా భామిని పట్టిన బంగారు కలశమునకు పోల్చుట. సంజచీకటుల యమునాజలము తోడను, లేతవెన్నెలల గంగాజలముతోడను పోల్చుట ఔజ్జ్వల్యముతో పాటు ఔచితిని గలిగియున్నది. గంగాయమున లొక్కటిగా కూడి ప్రవహించుట సంజవేళ చీకటి వెన్నెలలు కలిసి కన్పించుట ప్రపంచప్రసిద్ధములు. సాయంకాలపు లేతవెన్నెల స్వచ్ఛమైనది గాదు. అది మసక చీకటిచే మలినమై యుండును. కాలము గడచుకొలది ఆ వెన్నెల కాంతులు దేరును. అందుచే ప్రాకృతి స్వచ్ఛతను సాధించ వలెనని వెన్నెల నీటిని వడపోయుచున్న దనుట విశేషించి ఉచితముగ నున్నది.

కొందరు కవులు తాము భావన చేయుదురు గాని భావించిన దానిని పాఠకులకు ప్రత్యక్ష మగునట్లు చిత్రించలేరు. చెలది పురుగు శివైక్యమును బొందు ఘట్టమందలి వర్ణన విశేషమైన ధూర్జటి భావనాశక్తికే గాక విశిష్టమైన అతని వస్తుప్రత్యక్షీకరణశక్తికి గూడ ఉచితమైన ఉదాహరణ. చెలది పురుగు ఆత్మనిర్గత తంతుపంక్తిచేత ప్రాకారములు, గోపురములు, కొలువు కూటములు, నర్తన మందిరములు మొదలగువానిని శివునకేగాక గణపతి దక్షిణామూర్త్యాది దేవతలకు గూడ నిర్మించినది. అవి—

ప్రాతఃకాల తుషార శీకర చయ ప్రాప్తిన్ లస న్మౌక్తికో
పేతాగారము లట్లు చెల్వనగు తద్బింద చ్ఛటా జాత ఖ

ద్యోత చ్ఛాయలఁ గొంత సేపు బహురత్నోదీర్ణ గేహంబులై
లూతా కల్పిత తంతు పద్మములు వొల్పుం జెప్పఁ జిత్రంబులై

ప్రాతఃకాల తుషారబిందువులు ఆ నిర్మాణముల మీద నిలిచి కులుకుచుండ అవి ముత్తెములు తీర్చిదిద్దిన మేడలవలె ముచ్చట గొలుపు చున్నవి. తద్బిందు సందోహముచే పుట్టిన అరుణకాంతుల నవి కొంతసేపు రత్నాలంకృత మందిరములై విరాజిల్లుచున్నవి. ఈ దృశ్యమును దర్శింప గలిగిన రసజ్ఞునకు ఏ పండుగ దినముననో భవనముల నంతటను రంగురంగుల "బల్బు" లమర్చి ఒక్కచోట మీట నొక్కి క్షణమాత్రమున ఆ భవనముల నన్నింటిని విద్యుద్దీప విరాజితములుగ చేయు ఆధునికమైన అలంకరణ శిల్పము అనుభవపునరుక్తము కాకపోదు.

కాళహస్తికి వేశ్యాకన్యల పయనమును జెప్పుచు ధూర్జటి చేసిన సముద్ర వర్ణన.

తన యందుఁ బవ్వళించిన నీలవర్ణుని
నీడ నీరంబెల్ల నిండె ననఁగ
హేళికినోడి తానెటకుఁ బాఱఁగ లేక
తన యందుఁ దిమిరంబు దాఁగె ననఁగ
తన యందు బడబాగ్ని ఘనతర జ్వాలలు
మండగఁ సుందరంబు మాఁడె ననఁగ
జంబూ ఫల ద్యుతి సంబరం బంతయుఁ
దన యందుఁ బ్రతిఫలించినది యనఁగ

నీరద వ్రాత పురుహూత నీలకజ్జ
లాతసీపుష్ప కస్తూరి కాళిజాత

సన్నిభ చ్ఛాయఁ గనుపట్టు సాగరేంద్రుఁ
గాంచి రద్దేవు పూర్వభాగమున వారు

ఈ వర్ణనలో సంప్రదాయపు మూసకట్టుదనమున్నను పద్యము ధూర్జటి ప్రతిభా ముద్రాంకితమై ప్రత్యేకతను గలిగి యున్నది.

ధూర్జటి వర్ణనలు కొన్ని అతని ప్రపంచానుభవమును, నిశితమైన పరిశీలనాదృష్టిని తెలుపగలవు. కన్నప్పకథలో ఆటవిక జీవితమును, వేశ్యాకన్యల కథలో వేశ్యాజీవితమును ధూర్జటి వాస్తవికత ఉట్టిపడునట్లు వర్ణించినాడు. తవిదచేలకు దృష్టిబొమ్మలు నిలుపుట, చెంచెతలు మంచెల మీదనెక్కి ఒయ్యారముగా వడిసెళ్ళు విసరుట, కొండలలోని పంటచేలకు వరాహములు రాకుండ తెల్లని చామరఖండంబుల ప్రోగుద్రాళ్ళ గట్టుట, ఎఱుకులు కాట్రేని యుత్సవము సేయుట, వారి ఆచారవ్యవహారములు — తాను స్వయముగ చూడనిదే అంత సహజముగ వర్ణించుట సాధ్యపడదు.

మునుపు వడిన మేకముఁ గొనివచ్చి మిక్రుడ్డు
పొడిచి నీట శిరము దడిపి తోఁకఁ గోసి
ధూపమిచ్చి మీసంబుఁ బెకలించి
కానుకిచ్చి కాటిఱేనిఁ గొలిచి—

ఇట్టి పద్యములు అతని పరిశీలనాదృష్టి ఎంత నిశితమైనదో విశదము సేయగలవు. అట్లే వేశ్యలు తమ కూతుండ్రను వృత్తికి తయారుచేయు తీరు. వారి విలాసములు, విటులను వారు వినోద పెట్టు పద్ధతి ధూర్జటి చాల సహజముగ వర్ణించినాడు. ఆ కావ్యము నందలి వర్ణనలు కొన్ని ధూర్జటిపై గల ప్రబంధయుగ ప్రభావమును దెలుప గలవు. ఈ క్రింది పద్యము కాళహస్తి వర్ణనల లోనిది.

ఎల దోట ల్వనము ల్వధూ కుచము ల్రద్రీంద్రంబు లా కంటికి
న్ఫలము ల్వాతెర లంగ జాగము కళాబంధంబు లిచ్ఛాసనం
బులు కోపంబున బాయుటల్ తపము సంభోగంబు కైవల్య మం
దుల లీలారతి నుండు మానవుల కెందుం గాన మీ చిత్రముల్.

అష్టాదశ వర్ణనలో పురవర్ణన మొక్కటను మాట నిజమేగాని భక్తి ప్రధానమైన ఈ ప్రబంధము వ్రాయునపుడు కొండలు వధూ కుచంబులుగను ఇచ్ఛాసనంబులు అంగజాగమ కళాబంధంబులుగను, సంభోగము కైవల్యముగను ధూర్జటికి గన్పించుట చూడ ప్రబంధయుగ మా భక్తుని కంటి కెట్టి సులోచనముల వేసియున్నదో సహృదయులకు తెలియగలదు. ఒకప్రక్క శృంగారమును మరొక ప్రక్క మోక్షమును ప్రదర్శించుచు ఈ పద్యము యుగతత్త్వమునే గాక కవి వ్యక్తిత్వమును గూడ కన్పింప జేయుచున్నది.

సామాన్యముగ క్షేత్రమాహాత్మ్యములలో చెప్పదగిన పాత్రచిత్రణ ముండదు. కాని ధూర్జటి పాత్రచిత్రణ నైపుణ్యము కన్నప్ప పాత్ర యందును నత్కీరుని పాత్ర యందును కాననగును. తిన్నని పాత్రలోని విశేషము ముగ్ధభక్తి. తదనుగుణముగ అతని అమాయికతను ధూర్జటి చక్కగా చిత్రించినాడు. తిన్నడు శివలింగమును జూచి

ఓ సామి! యిటువంటి కొండ దరిలో నొంటిం బులుల్ సింగముల్
గాసిం బెట్టెడు కుట్ర నట్టడవిలోఁ గల్గువ్వె క్రీనీడ నే
యాసం గట్టితి వేటిగడ్డ నిలు? నీ వాకొన్నచోఁ గూడు నీ
శ్కే చుట్టంబులు దెచ్చి పెట్టెదరు? నీ కిందేటికే లింగమా?—

అని యనుటలో అతని అమాయికత యెట్టిదో తెలియగలదు. అంతే గాక ఆ అమాయికతలో జీవనాడివలె స్పందించు చిత్తశుద్ధి గూడ

సహృదయున కనుభూతమగును. తిన్న డా లింగమునకు తేనెలు, పండ్లు కఱుకుట్లు మొదలగువాని నాహారముగా నర్పించుటయందును, నీవు నావెంట మా యూరికి రమ్ము లేకున్న నిన్ను వదలి నే వెళ్ళ ననుట యందును, అర్పించు ఆహారపదార్థము లారగింపకున్నచో నీ పదరాజీవములపై ప్రాణములు విడుతు ననుట యందును ఆతని అమాయకతను, భక్తిని, పట్టుదలను, చిత్తశుద్ధిని కవి చక్కగా వ్యక్తము చేసినాడు.

తిన్నని పాత్రలో భక్తికి దోడు సాహసోపేతమైన త్యాగ ముండుట మరొక విశేషము. ఒకవిధముగ సాహసము త్యాగమునకు జీవాతువు వంటిదే. శివుని కంటినుండి నెత్తుటిధారలు కారుచుండ తిన్నడు మందుటాకుల నెన్నింటినో దెచ్చి మాన్ప జూచి విఫలుడై విచారించి బాణమున తన కంటినే పెకలించి పరమేశ్వరుని కంటి కతికించినాడు. వెంటనే పశుపతి రెండవ కంటినుండి గూడ నెత్తురు స్రవించినది. అప్పుడు చెప్పుకాలితో నిటలాక్షుని కన్గొన తన్నిపట్టి బాణంబున తన రెండవ గ్రుడ్డు పెకలించు తిన్నని ప్రయత్నమును కవి అద్భుతముగ ప్రదర్శించి నాడు. అట్లే నత్కీరుని ఆత్మవిశ్వాసము ధైర్యము, స్వతంత్ర ప్రకృతి చక్కగా పోషింపబడినవి.

గ్రంథమున మానవులను పాత్రలుగ చేసి పోషించుట కంటె జంతువులను, క్రిమికీటకాదులను పాత్రలుగ చేసి పోషించుట అసాధ్యము కాదు గాని కష్టసాధ్యము. చెలదిపురుగును, పామును, ఏనుగును పాత్రలుగ చేసి ధూర్జటి ప్రశంసార్హముగ పోషించినాడు. ఒక్క ఉదాహరణ. శివలింగమునకు తా నర్పించునట్టి రత్నసంతతుల ప్రక్కకునెట్టి బిల్వపత్రము లను బిసతంతులను అలంకరించిన సామజమును గూర్చి సర్పము బాధపడి పరమేశ్వరునితో నిట్లు చెప్పసాగినది.

కంటక మెట్లు నాక సుముఖత్వము నొందితివయ్య పార్వతీ
కంటకి తాంగ బాహు లతికా యుగ సంతతిఁ బోలె దుఃఖకృ
త్కంటక బిల్వకా కమల కాండము లెత్తిన మోచి మోచి ము
క్కంటి! యెఱుంగవే నొసలి కంటి మహత్త్వము నీకుగల్గుటన్

ఈ మాటలలో సామ పరమేశ్వరా ! నీ యభిరుచి ఇంతమాత్రమా యని మిక్కిలి మెలకువగ ఎత్తిపొడిచినది. అంతేగాక విరోధిపైకి ఆ విరూపాక్షుని కవ్వించుచు ముక్కంటి యని సంబోధించి నీ నొసటి కంటి మహత్త్వమును మరచితివా యని తలపింపజేయుట పగగొన్న సామునకు ప్రకృతిసహజమై శ్లాఘింప దగియున్నది. తా నుంచిన బిల్వపత్రముల ప్రక్కకు ద్రోసి విశ్వేశులింగమును వివిధరత్నములతో నలంకరించిన భుజంగమును గూర్చి మత్తేభము మహేశ్వరునితో నిట్లు చెప్పినది.

ఉనికి శిలోచ్చయంబు నిజయోష శిలోచ్చయ రాజపుత్రి నీ
ధనువు శిలోచ్చయంబు పురదాహ ! రథీకృత రత్నగర్భ ! నీ
మనమున కీ శిలాశకల మండన మెట్లు ప్రియంబుఁ జేసె ? నే
మనగలవాఁడ నిన్ను వ్రతహాని మొనర్చు దురాత్ముఁడుండగన్

వ్యాళముపై విరోధ మూని విరూపాక్షుని రెచ్చగొట్టు ఇందలి వ్యాజస్తుతి వేదండ పాత్ర పోషణ కెంతయు తగియున్నది.

ఇట్టి గ్రంథములలో రసపోషణను గూర్చి విశేషించి చెప్పుకొన దగిన విషయము లుండవు. గ్రంథమున ప్రధానముగ పోషింప బడినది భక్తి-భక్తిరసమా? భావమా? యనునది విషయాంతరము. ఎడనెడ శృంగార వీరరసములు పోషింపబడినవి. శాంత కరుణములు గూడ కొన్ని పట్టుల కన్పించగలవు. సామజమునకు సర్పమునకు గలిగిన పోరాటమందును,

గరళ కంఠునకు కవ్వడికి జరిగిన కయ్యమందును వీరరస ముత్కృష్టముగ పోషింపబడినది. తిన్నడు కంటి గ్రుడ్డును పెకలించి లింగమున కతికించునపుడు, నత్కీరుడు పరమేశ్వరు నెదిరించునపుడు వ్యక్తమగు వీరరసచ్ఛాయలు సహృదయుల నాకర్షింపగలవు.

ఆకాశమందలి నక్షత్రములు స్వయంప్రకాశ శోభితములైనను ఒకదాని కాంతి మరియొకదానిపై పడకపోదు. అట్లే వాఙ్మయమున కవులు వ్యక్తిగత ప్రతిభావిశేషము లున్నవారైనను ఒకరి ప్రభావ మింకొకరిపై ప్రసరించక పోదు. అందుచే ఒక కవిపై ఇతర కవుల ప్రభావ ముండుట సహజమనిచెప్పదగునేగాని లోపమని లెక్కింపగూడదు. ఆంధ్రదేశమునకు కాళహస్తి దాక్షారామ శ్రీశైలములు పురాతన కాలమునుండి ప్రసిద్ధినొందిన ఎల్లలగుట, విశేషించి అవి మూడును శివక్షేత్రములగుట హేతువాదమున కతీతమైన కాల చిత్రము. వాటిలో దాక్షారామమును దక్షిణ కాశిగా చిత్రించి అందలి భీమేశ్వరుని ప్రస్తుతించిన శ్రీనాథుడు, కాళహస్తిని దక్షిణ కైలాసముగ చిత్రించి అందలి కాళహస్తీశుని కీర్తించుచు కావ్యము వ్రాయు ధూర్జటికి మార్గదర్శకు డగుట అసంభవము కానేరదు. శ్రీనాథుని వలె ధూర్జటిగూడ శివభక్తుడేగాని వీరశైవుడుగాడు. ఎఱ్ఱన నృసింహ పురాణము కాలమునుబట్టి మొదటిదైనను స్థానిక చిత్రణ కలిగిన భీమేశ్వర పురాణము క్షేత్రమహాత్మ్యములకు మేలుబంతి యైనది. ధూర్జటిపై ఎఱ్ఱన ప్రభావము సంగతి ఎట్లున్నను శ్రీనాథుని ప్రభావము సోకిన దనక తప్పదు.

ధూర్జటిమీద ప్రభావమును ప్రసరింప గలిగిన మరొక పూర్వకవి పోతన. పోతన మహాభక్తుడు మాత్రమేగాక స్వతంత్ర ప్రకృతిగల ప్రతిభావంతుడు. మహారాజుల అధికారమునుగాని వారి ఐశ్వర్యమునుగాని లెక్కసేయక ధిక్కరించి తన కవితను పురుషోత్తముని కర్పించి

పుణ్యమూ_ర్తి. అట్టి వ్య_క్తిత్వముగల పోతనకు కాలాంతరము ప్రదర్శించిన ప్రతిబింబము ధూర్జటి. "ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి" అను పద్యమునకు "రాజుల్ మత్తుల"ను ప్రతిధ్వని పుట్టుటకు ఆంధ్రవాఙ్మయమున ఒక్క యుగము పట్టినది. ఈ యిద్దరి వ్య_క్తిత్వములో పేర్కొన దగిన భేదము లున్నవి. పోతన మొదట శివభక్తుడై పిదప విష్ణుభ_క్తుడైనాడు. ధూర్జటి మొదటినుండియు శివభ_క్తుడే. కాలము గడచు కొలది ఈతని శివభ_క్తి గట్టిపడినది. రాజాశ్రయములను, భోగములను మొదటినుండి వెంబడించని వాడు పోతన. వానిని వెంబడించి విసివి అవి ఎండమావులని ఎంచి వెనుదిరిగినవాడు ధూర్జటి.

సమకాలీన కవి ప్రభావముగూడ ధూర్జటి మీద పడకపోదు. కృష్ణరాయలు వైష్ణవభ_క్తిని ప్రదర్శించు ప్రబంధమును వ్రాసినాడు. శైవ మహాత్మ్యమును తెలియజేయు గ్రంథ రచన కాతని ఆము_క్తమాల్యద ధూర్జటిని కొంతకు కొంత పురికొల్పి యుండకపోదు.

"కొంచెన్ వైష్ణవు డర్ధయోజన జటా ఘూటోత్థశాఖోప.... ... ....
"కొంచెన్ వంచిత పాంచభౌతిక సుఖాకారాంగమున్ .... .... ....

ఇట్టి పద్యపు యెత్తుగడలలో రెండు గ్రంథములందును సామ్యము లున్నవి. ఈ సామ్యములు ప్రభావసిద్ధములో ప్రకృతిసిద్ధములో చెప్పలేము. అట్లే మనుచరిత్రలోని సిద్ధుని వర్ణన ఆము_క్తమాల్యదలోని మాలదాసరి వర్ణన కాళహ_స్తి మహాత్మ్యములోని జంగముని వర్ణన సమాంతరరేఖలుగ సాగిపోవుట సహృదయ విదితమే.

తెలుగు భాషలో శతకము బహుళ ప్రచారము గలది. ఆబాల గోపాలమునకు అందుబాటులోనున్న సాహితీప్రక్రియ శతకము. సంస్కృత

శతకము కంటె తెలుగు శతకము ఎంతో పరిణతి నొంది స్వరూపమున సిద్ధి పొందినది. దైవస్తుతి మూలకందముగ పుట్టినట్టిదే శతకము. క్రమముగ ఈ స్తుతి స్వభావము ననుసరించియే అష్టోత్తరశతసంఖ్య శతక నియమముగ నేర్పడినది. ఈ సంఖ్య స్థిరపడుటకు జపమాలలోని పూసలసంఖ్య. దేవతా స్తుతిలోని అష్టోత్తరశతనామావళి దోహదము చేసినవి. తదుపరి ఇష్టదేవతా పరమైన మకుటము శతకమున ముఖ్యాంగమైనది. ఆత్మపర కవిత్వము శతకవాఙ్మయమున ప్రాధాన్యము వహించినది. మన వాఙ్మయమున లెక్కకు మిక్కిలిగ శతకములు పుట్టినవి. వీనిని నాల్గు భాగములు చేయవచ్చును. 1. భక్తి శతకములు 2. శృంగార శతకములు 3. వేదాంత శతకములు 4. నీతి శతకములు. భక్తిశతకములు సంఖ్యయందేగాక గుణమునందును గురుతరమైనవి.

ఈ శతక వాఙ్మయమున కాళహస్తీశ్వరశతకము కైలాసశిఖరము వంటిది. పండబారిన వయస్సున ధూర్జటి దీనిని వ్రాసినట్లున్నాడు. కవితమీది గౌరవము, రాజాశ్రయములమీది మమకారము, భోగములమీది కాంక్ష పూర్తిగాపోయి, నిర్లిప్తుడై, నీలకంఠుని ప్రార్థించు ధూర్జటిని ఈ శతకమున సహృదయులు చూడవచ్చును. శతకమందలి మొదటి పద్యముననే ఆ మహాభక్తుని అంతస్తత్త్వ మగుపించును.

శ్రీ విద్యుత్కళితా జవంజవ మహాజీమూత పాపాంబు ధా
రా వేగంబున మన్మనోబ్జ సముదీర్ణత్వంబుఁ గోల్పోయితిన్
దేవా మీ కరుణా శరత్సమయ మింతేఁ జాలుఁ జిద్భావనా
సేవం దామరతంపరై మనియెదన్ శ్రీ కాళహస్తీశ్వరా ?

శతకమున ప్రధానముగ గోచరించునవి నాలుగంశములు. అవి భోగముల ఛీదరించుకొనుట, రాజులను తూలనాడుట. కవిత్వమును పాండిత్యమును

కొంచెపరచుట, పరమేశ్వరభక్తిని ప్రదర్శించుట. కాని ఈతని మాటలలో అగుపించినది అందనిపండ్లు పుల్లనను తత్త్వముగాదు. అన్నింటిని అనుభవించి, అనుభవించిన వన్నియు అస్థిరములని యెరిగి, అంతిమ యాత్రకు భక్తి నొక్కదానినే పాథేయముగ గొన్న పరమభక్తుని ప్రబోధ మీ శతకమున ప్రతిధ్వనించును.

భోగము లనుభవించి తల బట్ట గట్టినదని, చేసిచేసి సంసారము రోతపుట్టినదని, విరక్తునిజేసి కాళహస్తీశ్వరా! కడతేర్పుమని, రాజులు మత్తులని, వారి సేవ నరక ప్రాయమని, వారిచ్చు అంభోజాక్షీచతురంతయాన తురగీ భూషాదు లాత్మవ్యథా బీజములని, ఛీ ఛీ! రాజశబ్దము జన్మాంతర మందుగూడ నొల్లనని, కాళహస్తీశ్వరా! జ్ఞానలక్ష్మీ జాగ్రత్పరిణామ మిమ్మని, సత్యంబు వర్ణింప కవిత్వము చాలదని, చదువుత్వేర్పిన పండితాధములని, బోధావిర్భావ విదానములు చదువులు కావని-స్వర్ణయుగ మున పుట్టి-అందును సాహితీసమరాంగణ సార్వభౌముని ఆస్థానమున నుండి అనగలిగిన వాడెవ్వడు? అనినను ఆ కాలమున ఆ మాట లాస్వాదించు వారెవరు?

ధూర్జటి కాలమున కెదురీదిన మహాకవి. సువర్ణ సూత్రములవంటి ఆ మహాకవి వాక్యములు చిరంజీవములు.

★

# అవధానము

అవధాన మనగా మనస్సును కేంద్రీకరించుట. మనస్సు సృష్టిలోని విచిత్రములలో మహాచిత్రమైనది. అది ఒక విషయమున నిండుగ మునిగియున్నను ఇతరవిషయములు దానికి కేవలము దృష్టిదూరములు గావు. వెలుగుకిరణ మొక వస్తువుపై ప్రాలియున్నను ప్రక్క వస్తువుపై కొంచెమైనను తన కాంతి నెట్లు ప్రసరింపజేయునో మానవుని మనస్సు గూడ ఒక్క విషయమున నిమగ్నమైనను ప్రక్క విషయముల విస్మరింపక ప్రవర్తింపగలదు. ఒకవిధముగ కేంద్రీకరణ, వికేంద్రీకరణ రెండును మనోరథమునకు చిత్రమైన చక్రములే. ఇట్టి తత్త్వము పునాదిగా పుట్టినట్టిదే అవధానము.

అవధాన మను పదము వేదాధ్యయనమున మొదట వాడబడినది. వేదములో పేర్కొను మన్న పన్నమునుగాని, ప్రశ్నించిన పనసనుగాని తు. చ. తప్పకుండ వల్లించు వానిని అవధాని యని విజ్ఞులు వ్యవహరించి నారు. పద, క్రమ, జట, ఘన, రథ, విశేషముల పాటించి పొరపాటు లేకుండ పనస చెప్పవలెనన్న అవధానికి అఖండమైన ధారణాశక్తి యుండ వలెను. వేదపాఠమునకు ఆ వృత్తి అత్యావశ్యకము. పై విధానమే వైదికావధానముగ పేరుపొందినది.

వేదమంత్రములకు ఉదాత్త, అనుదాత్త, స్వరిత, ప్రచయము అను చతుర్విధ స్వరము లున్నవి. ఒక్కొక్క పనస ఒక్కొక్క స్వరముతో

ప్రారంభమగును. పృచ్ఛకుడు దూరమున గూర్చుండి ఒక పనస మనసులో ననుకొని వ్రేళ్ళమీద బొటన వ్రేలితో స్వరముల మాత్రము చూపును. ఆ వ్రేళ్ళ గుర్తును జూచి అవధాని ఆ పనసను పఠించును. ఈ పద్ధతి స్వరావధానముగ చెప్పబడినది.

నేత్రావధానమని వేరొకటి గలదు. ఇందు ఇద్ద రవధాను లుందురు. మనము వ్రాసి యిచ్చిన వాక్యమును కేవలము కనులు కదల్చి ఒకఅవధాని మరొక అవధానికి తెలియజేయును. రెండవ అవధాని ఆ కనుసన్నలను గుర్తించి, ఇచ్చిన వాక్యమును మాటల రూపమున మనకు చెప్పును. ఈ అవధానము లన్నింటికంటె అష్టావధానము, శతావధానము దేశమున— విశేషించి ఆంధ్రదేశమున వ్యాప్తినొందుటయే గాక అపారమైన కీర్తి నొందినవి.

అష్టావధానము అష్టదళపద్మము. శతావధానము శతపత్రపద్మము. పృచ్ఛకు లడిగిన ప్రశ్నలు గ్రహించి అవధాని అంతర్ముఖుడగును. అప్పుడవధానము ముకుళితకమలము. ఆలోచించి మనస్సులో సమాధానములు సిద్ధమైన పిదప, అవధాని క్రమక్రమముగ పృచ్ఛకులకు ప్రత్యుత్తరము లిచ్చును. అప్పుడు, సూర్యోదయమున ఒక్కొక్కటిగ రేకులు విప్పుకొని వికసించిన పద్మమువలె అవధాన సభ అలరారగలదు.

అష్టావధానమున అంగము లెనిమిది.

| | | | |
|---|---|---|---|
| 1. కవిత్వము | 2. వ్యస్తాక్షరి | 3. గణితము | 4. సమస్య |
| 5. పురాణము | 6. నిషిద్ధాక్షరి | 7. చదరంగము | 8. సంభాషణ |

అవధాని అభీష్టమును బట్టియు, సదస్యుల అభిరుచిని బట్టియు ఈ ఎనిమిదింటిలో కొన్నింటికి మార్పు గలుగును. కొందరు కొన్నింటిని వేరు

మార్చి వ్యవహరింతురు. ఏ మార్పు చేసినను అంగముల సంఖ్య ఎనిమిదికి తగ్గదు.

కవిత్వమును కొందరు వర్ణన యని పేర్కొందురు. పృచ్ఛకుడు ఒక మనోహర సన్నివేశమును చెప్పి దానిని వర్ణింపవలసినదిగా కోరును. క్రింది వర్ణన మాయామౌనివేషమున నున్న పార్థుడు సుభద్రకరము పట్టుకొన్న ఘట్టములోనిది.

కాషాయవస్త్రమ్ముఁ గని పాఱిపోకుము
నీకైన వేషమో నీరజాక్షి
పెద్దగడ్డము చూచి బెదరి పోయెదవేల
నీకైన వేషమో నీరజాక్షి
వెలిబూదె యంటునం చులికి పడెదవేల
నీకైన వేషమో నీరజాక్షి

యనుచుఁ దన కర మర్జునుఁ డదిమి పట్టఁ
బెద్ద లే మందురో ? యను భీతిఁ జేసి
వదలి పోలేక పోలేక వదలి పోవు
చున్న యటులీ సుభద్ర తానున్న దహహా !

ఆశువుగా వర్ణనాపద్యము చెప్పుట అవధాని కంత కష్టమైన పనిగాదు. అది యతనికి వెన్నతోబెట్టిన విద్య. మిగత ఏడంశములతో గలిపి ఈ పద్యమును ఆలోచించుటయే అం దిమిడియున్న శ్రమ. ఊపిరితిరుగని చోట్ల పై పద్యమందువలె ఒకే వాక్యమును గణములు కుదురునట్లు చూచి అన్ని పాదములందును అవధానులు వాడుకొందురు. చిట్టచివర తగిన గణము దొరుకకున్న పై పద్యమందువలె అహహా ! యని తప్పించుకొందురు.

పృచ్ఛకుడు మనస్సులో ఒక వాక్యమనుకొని అవధాన సమయమున క్రమము తప్పించి అప్పుడప్పుడు అందలి అక్షరములిచ్చి చివరకవన్నియు సక్రమముగ కూర్చి చెప్పుమనుట వ్యస్తాక్షరి. అక్షరముల పృచ్ఛకుడు నోటితో చెప్పవచ్చును—లేదా కాగితముపై వ్రాసి ఒక్కొక్కదానికి అంకెవేసి కత్తిరించి అవధానికి చూపవచ్చును. ఏ రెండు మూడు గంటలో జరుగు అవధానమున ఒక క్రమము లేక అప్పుడప్పుడు చెప్పినట్టి అక్షరములను, వానికి వేసిన అంకెలను గుర్తుపెట్టుకొని చిట్టచివర కొక క్రమములో వానిని కూర్చి చెప్పుటలో ఎంత శ్రమ ఇమిడి యున్నదో, ఎంత జ్ఞాపకశక్తి కూడి యున్నదో సహృదయు డూహింపగలడు. ఇచ్చినది అర్థయుక్తమైన పద్యపాదమైనచో అక్షరముల సహవాసము కొంతవరకు జ్ఞాపకశక్తికి సాయపడును. అర్థములేని అక్షరసమూహ మొకటి కల్పించుకొని అందలి అక్షరము లిచ్చుట, అవధానికి తెలియని భాషలోని వాక్యమందలి అక్షరములు చెప్పుటకూడ సాధారణముగా జరుగు చుండును. అవధాని, తన కా భాష అర్థముగాకున్నను చెప్పిన అక్షరమును దానికీయబడిన సంఖ్యను గుర్తుపెట్టుకొని అంకెలను బట్టి అక్షరముల నొక క్రమములో కూర్చుకొని పృచ్ఛకునికి ప్రత్యుత్తరమిచ్చును. ఒక అవధాని తనకు తెలియని భాషలో తప్పులేకుండ చెప్పిన వ్యస్తాక్షరి: హి, హు, ఈజ్, కన్, విన్, స్డ్; ఎ, గెన్, స్ట్, హిజ్, విల్, ఈజ్, అఫ్, ది, సేమ్, ఒ, పి, ని, యన్, స్టిల్.

మూడవది గణితము. ఇది మూడు నాల్గు రూపములలో నుండును: గంటలుకొట్టుట, పూవులువేయుట, పుట్టిన తేదీనిబట్టి వారము చెప్పుట; కూడికలు గుణకార భాగహారములు చేయుట, అవధాని ఇష్టమునుబట్టి ఈ నాల్గింటిలో నొకటి యుండును. అవధానము జరుగు సమయమున నిదానముగ నొక వ్యక్తి గంటలు కొట్టుచుండును. అవధాని లెక్కించి

చివర కెన్ని గంటలు కొట్టినది చెప్పవలెను. గంటలకు బదులు కొన్నిచోట్ల అవధానిపై సభజరుగు సమయమున నెమ్మదిగ కొన్నిపువ్వులు వేయుదురు. ఈ పువ్వుల సంఖ్య చివరకు చెప్పవలసియుండును. ఈ రెండును గాక పుట్టిన తేదీ చెప్పి ఆనాటి వారము చెప్పుమందురు. అవధాని లెక్కవేసి వారము పేరు తెలుపవలెను. కొన్ని చోట్ల కూడికలను గుణకార భాగహారములను అవధాని నడుగుదురు. వారము చెప్పుట, ఈ లెక్కలు వేయుట అవధానుల కంత కష్టముగాదు. ఏవో సులభ పద్ధతుల వారు స్వాధీనము చేసికొనియుందురు. అవి వ్యాపార రహస్యములు. పూవులను గంటలను గూడ అవధానులు ఒకటి, రెండు, మూడను వరుసక్రమములో లెక్కపెట్టరు. ఎన్నో విషయముల మనస్సులో ఆలోచించుచు వానినట్లు లెక్కపెట్టుట కష్టసాధ్యము. అంతేగాక ఆ పద్ధతిలో లెక్క తప్పు అవకాశము లెక్కువ. అందుచే అవధాని ఒకటి మొదలు పదివరకు కొన్ని సంజ్ఞలను, పదిమొదలు ఇరువది వరకు మరికొన్ని సంజ్ఞలను ఏర్పరచుకొని ఆ సంఖ్య వచ్చినపుడు ఆ సంజ్ఞను గుర్తుపెట్టుకొనును. ఉదాహరణ. ఒక గంట కొట్టినపుడు లేదా ఒక పువ్వు పడినపుడు ఓంకారమని, అవి రెండైనపుడు జీవాత్మపరమాత్మలని, మూడైనపుడు త్రిమూర్తులని, నాలుగును చతుర్వేదములని—పదకొండింటిని ఏకాదశ రుద్రులని, పన్నెండింటిని ద్వాదశాదిత్యులని అవధాని గుర్తుంచుకొనును. ఆదిత్యులను ఒక్కమాట గుర్తుపెట్టుకొన్నచో ముందు సంఖ్యలు మరచిపోవచ్చునుగదా. ఇరువది వరకు ఇట్లు గడపి ఇరువది దాటినపుడు మరల ఓంకారమును ఆరంభించవచ్చును. సామాన్యముగా గంటకు పది గంటల కంటె ఎక్కువ కొట్టరు. అట్లే గంటకు పది పువ్వులకంటె ఎక్కువ వేయరు.

అవధానమున సదస్యులు సమస్యకు ప్రాధాన్యమిత్తురు. ఇచ్చిన సమస్యలోని విరోధాభాసము విరుగునట్లును, చమత్కారము శోభిల్లునట్లును

అవధాని అన్నిటితోపాటు అప్పటికప్పుడు సమాధాన మూహించి సరస మైన పద్యముతో సభకు సంతర్పణ చేయవలెను. సమస్యాపూరణ అవధాని ప్రతిభకు గీటురాయి. సమస్యలోని విరోధాభావము తప్పించుటయే పెద్ద చిక్కు. ఇందులకు అవధానులు ముందుగనే కొన్ని మెలకువలు మనస్సులో కూర్చుకొందురు. ఇచ్చిన సమస్యలోని అర్థము అనుకూలముగ నున్నచో దాని నొక ప్రసిద్ధ సన్నివేశమునకు సరిపెట్టి చెప్పుట సామాన్యపద్ధతి.

"మానవతీలలామ కభిమానమె చాలును జీర యేటికిన్"

ఓ నవనీతచోర ! కృప యుంచి పటమ్ముల నిచ్చి వేగ మా
మానము గావుమన్న వ్రజమానిని పల్కుల కెంతొ వింత న
వ్వానన సీమ దోఁపఁ గమలాక్షుడు దానిటు పల్కె మానినీ !
మానవతీలలామ కభిమానమె చాలును జీర యేటికిన్.

సమస్య గోపికావస్త్రాపహరణ ఘట్టమునకు చక్కగ అతికినది. కటిబంటి నీట నిలిచి నా వస్త్రమిమ్మని ప్రార్థించు గోపికను, చెట్టెక్కి చీరలు దగ్గర పెట్టుకొని చిరునవ్వు సొంపువంపులతో "మానినీ ; మానవతీ లలామ కభిమానమె చాలును చీర యేటికిన్" అని సరసములాడు శ్రీకృష్ణుని చిత్తరువునందువలె చూచి సహృదయుడు పులకింపవచ్చును. సమస్యను అర్థాంతరన్యాసాలంకార సాయ మర్థించి సాధించుట సరసమైన మరియొక పద్ధతి.

"కమలబాంధవు దేతేర కలువ విచ్చె"

కృష్ణ నినుఁజూచి ధృతరాష్ట్ర నృపతి మిగుల
వింతగాఁ జెందె నెంతయో సంతసంబు
తలఁపగాఁ జెల్లనిది యీ విధమ్ము చూడఁ
గమలబాంధవుఁ దేతేరఁ గలువ విచ్చెం

కృష్ణు రాకకు ధృతరాష్ట్రు డానందించుట కమలబాంధవునిజూచి కలువ విచ్చుటే. ఇట అర్థాంతరన్యాసము అద్భుతముగ అతికినది. కాగా సమస్య లోని మొదటి పదమును ముందు పాదమందలి చివరిపదమున కతికి ముప్పు దప్పించుకొనుటయు సమస్యాపూరణలో మొప్పునొందిన పద్ధతియే.

"కుండను కొండ సొచ్చె నిదిగో యని పల్కెను విస్మయంబునన్"

కొండలు రేగి లోకముల గుండలు సేయుచు నుండఁజూచి యా
ఖండలుఁ డుద్ధతుండఖు యఖండ పరాక్రమ మొప్ప తెక్కలన్
జెండఁ గడంగుటన్ దెలిసి శీతనగాత్మజుఁ డబ్ధి వ్రజి రా
కుఁడను గొండ సొచ్చె నిదిగో యని పల్కెను విస్మయంబునన్.

కొన్ని సమస్యలు కొరుకుడు పడవు. అట్టివానిని ప్రశ్నపరంపరచే అవధాని పగులగొట్టగలడు.

అలర గణింప పంక్తిరథు నాత్మజు లెవ్వరు? మైథిలుండు నే
లలనకు తండ్రి? మన్మథుని లావు శరంబులు నేవి? అంబికా
చెలువుని నామ మెద్ది? మరి సీరియు శౌరికి నేమి గావలెన్?
చెలువగ రామలక్ష్మణులు, శీతకు, తమ్ములు, శూలి, యన్నయున్.

అంతేగాక ఉన్మాదము, స్వప్నము అవధాని చేతి చివరి అస్త్రములు. ఎటు చూచినను సమస్యలోని విరోధాభాసము విరుగుడు పడకున్నచో అసంబద్ధమైన అన్వయము చెప్పి ఉన్మాది ఇట్లన్నాడనియో లేక స్వప్నమున ఇట్లు చూచితి ననియో చివరకు చెప్పి తప్పించుకొనును.

తరువాతి అంశము నిషిద్ధాక్షరి. ఒక విషయమును వర్ణించి చెప్పుమని అవధాని నడిగి అతడు చెప్పు పద్యమున ఈ, యీ అక్షరము

ఉండ గూడదని అడుగడుగున నిషేధించుట నిషిద్ధాక్షరి. కాని ప్రాసస్థానము నిషేధించరాదు. ఏకాక్షరకోశాది జ్ఞానము, సంస్కృతాంధ్ర పాండిత్యము నిషిద్ధాక్షరిని నిర్వహించుట కుపకరించును. ఒకటి రెండు అక్షరములున్న పదములే అవధాని కిట శరణ్యములు. పృచ్ఛకుడు శ్రీశైలభ్రమరాంబను కందపద్యమున స్తోత్రము సేయుమన్నాడు. అవధాని చెప్పిన పద్యము.

అలఘు గుణశ్రీ పూర్వా!
విలయఘ్నా! పూర్ణ! తల్లి! విద్యుత్ భానూ
జ్జ్వల కాన్తి సమగ్రా! రా
వలెఁ గావన్ నిత్య సుప్రభా! వేగ ననున్

1. అ (ధి) ల (ర) ఘు (త) గు (రు) ణ (పూ) శ్రీ (భా) పూ (జ) ర్వా!
2. (చ) విల (సత్) య (వి) ఘ్నా! (స) పూ (త) ర్ణ! (మా) త (ర) ల్లి! వి (భ) ద్యుత్ (కాం) భా (స్వ) నూ
3. (వి) జ్జ్వల (దీ) కా (ర) న్తి (భా) స (ర) మ (స్త) గ్రా! (న) రా
4. (జి) వలె (ర) గా (పా) వన్ (స) ని (ర్మ) త్య (ము) సు (స్థి) ప్రభా! (స) వే (శ) గ (మ) న (లి) నున్.

ఇది కాళ్ళు కట్టి పరుగిడు మనుట వంటిది. ఎంత వేగముగ పోయెనని గాని, ఎంతదూరము పరుగెత్తెనని గాని ఎంచి చూడరాదు. పడకుండ పోయినచో ప్రశంసింపవచ్చును.

పురాణపఠనము. పృచ్ఛకులలో నొకడు ఏ పురాణమునుండియో లేక కావ్యమునుండియో ఒక ప్రసిద్ధ భాగములు స్వీకరించి పఠించును.

షదివిన పద్యములు అవధాని, ఏ గ్రంథ మందలివో ఏ సన్నివేశమందలివో చెప్పి వానికి సరసమైన వ్యాఖ్యానము సదస్యులకు చెప్పవలెను. ఒక్కొక్కసారి అవధాని ననుసరించి పురాణ పఠనమునకు బదులు శాస్త్ర చర్చను చేర్పింతురు. వ్యాకరణశాస్త్రమును గూర్చిగాని అలంకారశాస్త్రమును గూర్చిగాని లేక మరొక శాస్త్రమును గూర్చి గాని పృచ్ఛకుడు అవధానితో చర్చించును. మిగత విషయముల నాలోచించుటలో మునిగితేలుచున్న అవధాని ఈ అంశమును వెలితిలేకుండ నిర్వహించుటకు ఇతిహాసపురాణ శాస్త్రకావ్యపరిజ్ఞానము పూర్తిగ నుండవలెను.

పై అంశముల నిర్వహించుచు అవధాని ప్రక్కనున్న పృచ్ఛకునితో సంభాషణ నెరపవలెను. అవధానికి ఈ సంభాషణ సవతిపోరు వంటిది. ఈ సంభాషణనే వ్యర్థప్రసంగ మనియు, అధికప్రసంగ మనియు, ఆకాశపంచాంగ మనియు, లోకాభిరామాయణ మనియు పెక్కువిధముల పిలుతురు. అవధాని తన మనస్సునంతను వర్ణనకు, వ్యస్తాక్షరికి, గణితమునకు, సమస్యకు, నిషిద్ధాక్షరికి వినియోగించుచుండ అడుగడుగున ప్రశ్నలు వేసి అధికప్రసంగి అతని మనస్సును ప్రక్కకు లాగ ప్రయత్నించును. సామాన్యముగ ఈ ప్రశ్నలలో కొన్నింటికి తల లుండవు; మరి కొన్నింటికి తోక లుండవు. కాని ఇంచు మించు ఇవన్నియు చమత్కార భరితములే — అవధానిని అడుగడుగున చిక్కుపరచునవే. అయినను అవధాని ఈ ప్రశ్నలను ప్రక్కకు నెట్టి పురోగమించుటకు వీలులేదు. పైగా ప్రశ్న ఎంత చమత్కార భరితముగ నుండునో సమాధాన మంత చమత్కారపూరితము కావలెను. సంభాషణలో అవధానిది క్రిందు చేయిగా కన్పించరాదు. ఎట్టి ప్రశ్న వేసినను అవధాని ఆగ్రహమొందరాదు. ఆగ్రహము అసమర్థతాసూచకము. ప్రశ్నకు తగిన ప్రత్యుత్తరమిచ్చి అవధాని పృచ్ఛకునే పరిహాసభాజనుని చేయవలెను. ఉదాహరణ కొక

ప్రశ్న "అవధానిగారూ! ఈనాడు ప్రపంచశాంతి పెద్ద సమస్య అయింది గదా. ప్రపంచశాంతికి ఎందరో మహానుభావులు ఎన్నో ప్రయత్నాలు చేశారు. ప్రయోజనం లేకపోయింది. కడకు ఐక్యరాజ్యసమితి యంతటిది గూడ ఈ విషయంలో వ్యర్థమౌతున్నది. ప్రజ్ఞాధురీణులైన తమరు రాజకీయంగా పరిష్కారం సాధ్యబడని ఈ సమస్యకు సాంఘికమైన పరిష్కారమార్గం ఏదైనా సెలవిస్తారా." అవధాని సమాధానము. "పెద్ద ప్రశ్నే అడిగారు. అయినా నాకు తోచిన సమాధానం చెప్తా. ప్రతి అమెరికను యువకుడికి ఒక రష్యా యువతిని, ప్రతి రష్యా యువకునికి ఒక అమెరికను యువతిని ఇచ్చి వివాహం జరిగేటట్లు చూడండి. ఈ సమస్య దానంతట అదే పరిష్కారం కావచ్చు. పిలిపిస్తే నేను పౌరోహిత్యానికి వస్తా". ఇట్టి సమాధానముతో సభ ఏ పావుగంట సేపో పరవశత్వమున ఫక్కుమనగలదు. ఆ వ్యవధిలో అవధాని మిగత అంశముల ఆలోచించుకొనవచ్చును. సమర్థుడైన అవధాని అధిక ప్రసంగమును తన కనుకూలముగ వాడుకొనగలడు.

ఒకవైపు వర్ణనకు పద్యము కూర్చుకొనుచు, గణితము చేయుచు.... మరొకవైపు సమస్యను పూరించుటకు పద్యమును భావించుకొనుచు, వ్యస్తాక్షరిని గుర్తుంచుకొనుచు—ఇంకొకవైపు పురాణపాఠము చెప్పుచు, అధిక ప్రసంగమున పాల్గొనుచు, అవధాని చతురత మెరయునట్లు చదరంగ మాడవలెను. ఎత్తునకు పైయెత్తు ఎంతో జాగ్రత్తగా వేయవలెను. విజయ మెట్లున్నను తప్పుటెత్తు వేయగూడదు.

అవధానాంగములలో కొందరు దత్తపదిని చేర్చుకొందురు. ఏది చేర్చుకొన్నను అంగముల సంఖ్య ఎనిమిది దాటరాదు. పరస్పరము పొత్తుపొసగని నాలుగు పదము లిచ్చి వాని అర్థముల సమన్వయించి

పద్యము చెప్పుమనుట దత్తపది. దత్తపదికి సుప్రసిద్ధమైన ఉదాహరణ, గోలకొండ, మాలముండ, పూలదండ, క్రొత్తకుండ—ఈ పదములను భారతార్థమున కూర్చి పద్యము చెప్పుమనుట పృచ్ఛకు డడిగిన ప్రశ్న. ఈ పదములకు ఏకవాక్యత కూర్చుట ఎంత కష్టము! కాని అవధాని అద్భుతమైన పద్యము చెప్పినాడు.

ఓయి ధృతరాష్ట్ర! నీ కొడు కుత్త గోల
కొండ, లోకనాశన మాల ముండ నేల?
ఖండనమ్మున గెలిపింతు పాండుసుతుల
ఉదరమున పూలదండ రే కొత్తకుండ.

ఇవి వనమాలి ధృతరాష్ట్రునితో చెప్పిన మాటలు. భారతము పదునెనిమిది పర్వములలో ప్రదర్శించిన శ్రీకృష్ణుని, సహృదయుడీ తేట గీతిలో తిలకింపవచ్చును. అవధానికి సంధులు, సమాసములు దత్త పదిలో ఊతకోలలు.

ఇది అష్టావధానము.

శతావధానము సంఖ్యాబలము గలది. దీని స్వరూపము చెప్పుట సులభము. వందమంది పృచ్ఛకులు వరుసగ కూర్చుండి అవధానిని ప్రశ్నలడుగుదురు. ఒక్కొక్క పృచ్ఛకుడు తన కిచ్చవచ్చిన ఛందస్సులో ప్రత్యుత్తరము చెప్పమని అడుగును. సామాన్యముగ శతావధాన ప్రశ్నలలో సమస్యలు వర్ణనలు చాల ఎక్కువ. అవధాని ప్రశ్నల నన్నింటిని గ్రహించి అంతర్ముఖుడై సమాధానముల సిద్ధము చేసికొని క్రమక్రమముగ ఒక్కొక్క పృచ్ఛకునికి వారు కోరియున్న ఛందస్సులో ఒక్కొక్కపాదము చొప్పున చెప్పుచు పోవును. ఇట్లే రెండవపాదము,

మూడవపాదము, నాల్గవపాదము వరుసగా వందమందికి చెప్పును. శతావధాని వందమంది అడిగిన వర్ణనావిషయములు, వారు కోరిన ఛందోవృత్తములు, ముందు చెప్పిన చరణ మందలి ప్రాసాక్షరములు గుర్తు పెట్టుకొనవలెను. శతావధానము సంపూర్ణమగుటకు ఒక్కొక్కసారి ఒక్కరోజు సరిపోక పోవచ్చును. శతావధానమున నిష్కర్షగ నూరుమంది ప్రశ్నలడుగుటయు అసాధారణమె. అందుచే ఇరువదిమంది, ముప్పది మంది, ఏబదిమంది, ఎనుబదిమంది—ఎవరి శక్తికొలది వారు పృచ్ఛకుల పెట్టుకొందురు. చివరకు పృచ్ఛకుల సంఖ్య ఎనిమిది దాటినచో శతావధానమని చెప్పబడినది. చిత్రమైన వర్ణనలు శతావధాని నడుగుదురు. ఒక శతావధానమున శార్దూల వృత్తములో "బైసికిలు" వర్ణన.

> నీరుం గోరదు గడ్డి నడ్గ దొక కొన్నే నుల్వాల న్వేడ దే
> వారే నెక్కినఁ గ్రిందఁ ద్రోయ డొకడు న్బజ్జ న్బటుండుంట చే
> కూరంగా వల దెందు బైస్కిలునకుం గోపం బొకింతేని లే
> దౌరా! వాజికి సాటియైన యిది విశ్వామిత్ర సృష్టం బొకో.

అట్లే మరొక అవధానమున పరీక్ష ఫేలయిన విద్యార్థి వర్ణన.

> పలువురు పిల్లలందు నగుఁబాటు ఘటిల్లు నటంచు దుఃఖమున్
> వెలుపక నెవ్వరియ రికఁ బెండిలి గాదను నట్టి భీతియున్
> బొలుపగు ఫీజుకొలరియుఁ బోవునటంచును గొప్ప బెంగయున్
> గలిగి పరీక్ష ఫేలయిన స్కాలరు చింతల నొందు నెంతయున్.

మందాక్రాంత వృత్తమున గ్రామోఫోను వర్ణన.

> యే యే గాన ప్రకలిత ధియో యత్ర కుత్రాపి గాతే
> యా యా గాన ప్రకలిత ధియో యత్ర కుత్రాపి గాతే

తేషాం తాసాం ధ్వని ముపగతో ఖేదలేశేన శూన్యం
గ్రామోఫోనూ రచయతి తమానంద మే వా ద్వితీయం.

ఉత్తమ అవధానికి అవసరమైన ప్రజ్ఞలిట ప్రస్తావింపదగినవి. ఈ ప్రజ్ఞలను అంతరములు, బాహిరము లని రెండు భాగములు చేయవచ్చును. ఏకాగ్రత, ధారణ, స్ఫురణ—అంతరప్రజ్ఞలు. అవధానికి, తన మనశ్శక్తినంతను చిక్కబట్టి ఒక్క విషయమున కేంద్రీకరింప గల శక్తి యుండవలెను. ఈ శక్తి లోపించినచో అంత తక్కువ వ్యవధిలో అన్ని ప్రశ్నలకు సమాధానము సాధించలేడు. గ్రహించిన విషయముల నన్నింటిని మరువకుండ మనస్సు ధరించియుండుట ధారణ. పృచ్ఛకు లిచ్చిన ప్రశ్నలను ఆలోచించి సాధించిన ప్రత్యుత్తరములను, ఆ ప్రత్యుత్తరము లలో పేర్కొనియున్న—పేర్కొనవలసియున్న భాగములను అవధాని మనస్సు ధరించియుండవలెను. అవధానమున కిది ప్రాణతుల్యమైన ప్రజ్ఞ. సాంద్రముగ మూగియున్న విషయసమూహమునుండి అవసరమైన భాగము చిక్కపడకుండ వెంటనే వెలికివచ్చుట స్ఫురణ. ఏది కావలెనో ఏరికొనుట కెక్కువసేపు పట్టరాదు. వయస్సు గడచుకొలది వ్యక్తిలో ఈ శక్తులు సన్నగిల్లును. ఇవి పదును తగ్గనంతకాలము, అవధానము పాతము తగ్గదు.

బాహిర ప్రజ్ఞలలో ఆశుకవిత్వము, పాండిత్యము, సమయస్ఫూర్తి, పరిహాసరసికత పేర్కొనదగినవి. ఇవి పదిమందికి కనిపించునవి; అవధానమును రక్తి గట్టించునవి. ఏ విషయమును గూర్చియైన ఆశువుగా అడ్డులేకుండ పద్యమును చెప్పుటే అవధాని నేర్వవలసిన ప్రథమవిద్య. పది కాగితముల చెడగొట్టి ఒక్క పద్యమును వెలికిదీయువాడు అవధానిగా పనికిరాడు. ధారాశుద్ధి అవధాని కతి ముఖ్యము. అతడు పద్యము చెప్పుట హిమాలయ

సానువులనుండి పరవళ్ళుద్రొక్కుచు పరువెత్తివచ్చు గంగా ప్రవాహమును బోలవలెను, అప్పుడే ఆశ్చర్యానందములతో సదస్యులు తన్మయులై తగుదురని తలయూపగలరు. అడిగిన "ప్రతిమాటకు" పద్యమున సమాధానమిత్తునన్న ప్రజ్ఞను అవధాని ప్రదర్శింపవలెను. ఇట కవితా పదార్థముమాట దేవు డెరుగుగాని పద్యమున యతిప్రాసలు మాత్రము తప్పవు. అవధానికి పద్యము చెప్పు ప్రజ్ఞతోపాటు పాండిత్య ముండవలెను. పురాణపాఠమునకుగాని, శాస్త్రచర్చకుగాని, సమస్యాపూరణకుగాని, పాండిత్యము పెక్కు విధముల ఉపకరించును. పృచ్ఛకులుగా పండితులుందురు, సభను పండితు లలంకరింతురు. అడుగునది పండితులై ఆలకించునదియు పండితులైనపుడు అవధానికి పాండిత్య మెంత అవసరమో ఊహింప వచ్చును. పాండిత్యము బలము నిచ్చును. పాండితీవిభవుడైన అవధానిని పృచ్ఛకులు పడద్రోయలేరు. సమయస్ఫూర్తి, పరిహాసరసికత, అవధానము నకు శోభనిచ్చును. ఇవి రెండును అవధానికి పెట్టని అలంకారములే. సమయస్ఫూర్తి సదస్యులను చకితుల జేయును; పరిహాసరసికత పరవశుల జేయును. సంభాషణ కివి చాల సాయపడును. అడ్డు ప్రశ్నల నెదురొడ్డుటకు ఈ రెండు ప్రజ్ఞలు ఉక్కు కవచములు.

పై ప్రజ్ఞలతో పాటు అవధానికి అభ్యాసబల ముండవలెను. అవధాన ప్రజ్ఞ వ్యక్తికి ప్రకృతిసిద్ధముగ వచ్చునవి, ఉచ్ఛిష్టగణపతిని ఉపాసించుటచే గూడ ఆ ప్రజ్ఞ పొందవచ్చునని పెద్దలు పలికియున్నారు. అవి ఎంతవరకు నిజములో ఎరుగముగాని అవధానము చేయుటకు అభ్యాస బలము అపరిహార్యమని అనుమానములేకుండ చెప్పవచ్చును.

అవధాన సదస్యులను గూర్చి కొన్ని మాటలు చెప్పదగును. అవధానము కత్తిమీది సామువంటిది. అవధాని కృతకృత్యుడయ్యెనా

లేదా యని చూడదగునేగాని చెడు విమర్శలు చేయరాదు. పృచ్ఛకులు గూడ అవధానిని పరీక్షించు ప్రశ్నలు వేయవచ్చునుగాని పడద్రోయ ప్రయత్నించ రాదు. అర్థ్రితయుండి ఆనందింప గలిగినవారే అవధాన సభ కర్హులు.

ఈ అవధానముల ప్రభావమువలన కొందరికి పద్యమే కవితయను భ్రమ కలిగినది. గురువును లఘువు చేసి లఘువును గురువుచేసి గణములు కుదిర్చి యతిప్రాసలు అతికివేసిన ప్రతివ్యక్తియు నన్నయ తిక్కనాదుల ప్రక్కన నాకుగూడ పీటవేయుదురని పొరపాటుపడరాదు. అవధాన సాఫల్యమునకు పద్య మల్లు ప్రజ్ఞ ప్రధానము. రసమయమైన కవితకు ప్రతిభ ప్రాణతుల్యము. కవిత చెప్పుట, అవధానము చేయుట రెండును భిన్న ప్రజ్ఞలు. ఒకటి యున్నంత మాత్రమున మరొకటి యుండునని ఊహింప రాదు. కాని ఇవి రెండును కూడియున్న కవులు తిరుపతి వేంకట కవులు.

ఆంధ్రదేశమున అవధానమన్న పేరు ఎత్తగనే మనస్సులో సాక్షాత్కారమగు మహానుభావులు తిరుపతి వేంకట కవులు. అవధానము తిరుపతి వేంకటకవులుగను, తిరుపతి వేంకట కవులు అవధానముగను ఆంధ్రులకు ప్రత్యక్షమగుదురు. అవధానమునకు ఆ మహాకవుల జంట పర్యాయపద మనుటయు అతిశయోక్తిగాదు. అవధానమునకు మేధావుల మెప్పింపగల ఒక సుస్వరూపమును రూపొందించి, పాశ్చాత్య ప్రభావముచే జీవకణములు శిథిలములై ప్రాణము పోవుచున్న తెలుగు పద్యమునకు మరల ప్రాణ ప్రతిష్ఠచేసి శ్రీనాథునివలె నానారాజసందర్శనము చేసి సర్వసభాసమ్మాన ములు పొంది యావదాంధ్రమున సారస్వత జైత్రయాత్ర సాగించిన సరస సాహితీ మహారథులు తిరుపతి వేంకటకవులు. ఈనాడు పేరుకెక్కిన పెద్దకవు లందరు ప్రత్యక్షముగనో పరోక్షముగనో వీరి శిష్యులే. వీరిని "అద్భుత నాంధ్ర కవిప్రపంచ నిర్మాతల" నుట అక్షరసత్యము. మహాభారతమునకు

కవిత్రయము, భాగవతమునకు పోతనామాత్యులు పుట్టినట్లే, అవధానమునకు ఆధునికయుగములో ఈ మహాకవులు జన్మించినారు. పెద్దలనుజూచి పిల్లలు బొమ్మలపెళ్ళిళ్ళు చేసినట్లు ఆ మహాకవులనుండి భవ్యకవితావేశమును పొంది ఆంధ్రదేశమున అవధానములు, జంటకవిత్వములు కుప్పతెప్పలుగ బయలు దేరినవి. పోషణ తగ్గిపోయినను పుట్టుబలమున ఇంకను బ్రదికియున్నవి.

ఆంధ్రమందువలె అవధానము మిగత దేశభాషలందు లేదు. సంస్కృతమున నున్నదని చెప్పుటేగాని అది ప్రజల నాకర్షించి ప్రసిద్ధి కెక్కలేదు. పైగా యతిప్రాసల బాధ పెద్దగాలేని సంస్కృతమున అవధానము చేయుట అంత కష్టముగాదు.

అవధానము ఆంధ్రవాఙ్మయమున ఒక విశిష్ట ప్రక్రియ; ఒక మహోన్నత శిఖరము.

★

# ఖండకావ్యము

ఆంధ్రీకరణతో ఆంధ్రవాఙ్మయ మారంభమైనది. ఆరంభముననే గాదు అటు పిమ్మట గూడ ఆంధ్రీకరణలే అధికముగ వెలువడినవి. ఆసేతు శీతనగము సంస్కృత వాఙ్మయమునకున్న సువిశాలమైన యశస్సు, తెలుగు దేశమున ఆ దేవభాష పొందిన అపారగౌరవము, ఆ గీర్వాణభాషలో ఆబాల్యముగ నాంధ్రకవులు చేసిన విశేషకృషి, ఆంధ్రమున అట్టి వాఙ్మయారంభమునకు దారి తీసిన దేమో. సంస్కృత వాఙ్మయ మందలి మహాగ్రంథముల స్వీకరించి ఆంధ్రమున కనువదించి ప్రజల కందించుటయే తమ ప్రథమ కర్తవ్యముగను, పరమార్థముగను మన పూర్వకవులు భావించినారు. ఆ కావ్యముల తెలుగు సేయుటలో అచ్చటచ్చట మన కవులు అలతియలతి మార్పులు చేర్పులు చేయక పోలేదు. ఎంత గొప్ప చేసి చెప్పినను ఆ మార్పులు చేర్పులు వారి గ్రంథములను స్వేచ్ఛానువాదము లనిపించగలవు గాని స్వతంత్రరచన లనిపించలేవు. కథావిశేషములు ధర్మసూక్ష్మములు ప్రాముఖ్యము వహించిన మహాభారతాది గ్రంథముల నన్నయాదు లాంధ్రీకరింప, భాషాచమత్కృతులు, కవితారామణీయకములు ప్రాధాన్యము వహించిన నైషధాది కావ్యముల శ్రీనాథు లనువదించినారు. శ్రీనాథుని నైషధాంధ్రీకరణ మానాడు ఆంధ్రమున నూత్న మార్గమే. ఏలయన అరణ్యముల వంటి పురాణముల వదలి ఉద్యానముల వంటి కావ్యములలో ఇతడు మొదట ప్రవేశించినాడు. ఈ కావ్యాంధ్రీకరణ

కొంతకు కొంత క్రొత్త పద్ధతియే గాని స్వతంత్రము మాత్రము గాదు. అనగా అస్వతంత్ర రచనలో క్రొత్త పద్ధతి.

తరువాతి దశలో పురాణములను మహాకావ్యములను మొదటినుండి చివరవరకు అనువదించుట మాని ఏ పురాణాంతర్గతమైన కథనో గ్రహించి రసవత్కావ్యముగ తీర్చిదిద్దు పద్ధతికి తెలుగుకవులు పూనుకొన్నారు. ఈ మార్గమున ఎట్టిన ఆద్యుడైనను తరువాతి కవుల నాకర్షించిన అడుగు శ్రీనాథునిదే. స్కాందపురాణమందలి గోదావరీఖండమునుండి శ్రీనాథుని భీమఖండ మవతరించినది. క్షేత్రమాహాత్మ్యము లన్నియు ఈ పద్ధతిని ప్రదర్శించునట్టివే. కాని ఈ పద్ధతి పెద్దనార్యుని చేతిలో సిద్ధిపొందినది. మార్కండేయ పురాణ మందలి కథను నామమాత్రముగ గొని మధుఖండ సమంబైన మనుచరిత్ర నీతడు మన కందించినాడు. పురాణములనుండియు, మహాకావ్యముల నుండియు కథలు గొని స్వతంత్ర కావ్యములుగ తీర్చిదిద్దు పై పద్ధతియే దాదాపు ఆధునికయుగము వరకు అగుపించుచున్నది.

ఆధునిక కవులు ఈ మార్గముననే మరొక అడుగు ముందునకు వేసినారు. వీరు ప్రాచీన కావ్యములనుండి ఒక్క సన్నివేశమును మాత్రమే గ్రహించి రస సమంచితముగ దానిని చిత్రింప యత్నించినారు. అనగా నన్నయనాడు గ్రంథమంతటిని ఆంధ్రీకరించు పద్ధతి, పెద్దనకాలమున ఆ గ్రంథములనుండి ఒక్క కథను మాత్రమే గ్రహించి కావ్యముగ వ్రాయు మార్గముగ మారి, ఆధునిక యుగమున ఆ కావ్యమందలి ఒక సన్నివేశమే స్వీకరింపబడి సరసముగ చిత్రించు పద్ధతిగ పరిణామ మొందినది. ఈ పరిణతి సహజసుందరము.

ఇట్లు పరిణతినొందిన ప్రక్రియనే ఖండకావ్య మనవచ్చును. కష్ట కమల, గబ్బిలము, కృషీవలుడు, హృదయేశ్వరి, కరుణశ్రీ మొదలగునవి

ఆధునిక యుగమున ఆవిర్భవించిన కావ్యములు. విశేషించి చెప్పినచో అవి ఆధునిక కావ్యములు. అంతేగాని ఖండకావ్యపదము వానిపట్ల పొసగదు. ఏలన అవి స్వయంసంపూర్ణములు. కాగా తెలుగుదేశమున ఆంధ్రావళి, కృష్ణపక్షము, దీపావళి మొదలగు వానిని ఖండకావ్యము లనుచున్నారు. వానిని స్థూలార్థమున ఖండకావ్యము లనవచ్చునేమొ గాని నిజమున కవి ఖండకావ్య సంపుటములు. అయిన ఆ గ్రంథము లందున్న వెల్ల ఖండ కావ్యములా యని యడుగవచ్చును. కాదు. అవి చాలవరకు భావకవితలే. రాయప్రోలువారి ప్రబోధము, రాధాకృష్ణసందితుడు, కృష్ణపక్షములోని అయ్యో, అబ్బ, దీపావళిలోని ఆషాఢమేఘము, ఆశాగానము మొదలగు వానిని భావకవితలన జెల్లును లేదా భావఖండిక లనవచ్చును. ప్రకృతిలోని ఒక విషయమును జూచినపుడుగాని, ప్రసిద్ధమైన ఒక వ్యక్తిని దర్శించి నపుడుగాని, ప్రగాఢమైన ఒక అనుభూతి కలిగినపుడు గాని కవి హృదయ మున రేకెత్తు భావతరంగములు దాల్చు అక్షరరూపమే భావకవిత్వము. తెలుగునాట భావకవిత వేయని వేషములేదు. త్రొక్కని మార్గములేదు. కవిగ చేయని వ్యక్తిలేడు. అందుచేతనే భావకవితకు ప్రసిద్ధితోపాటు పరి హాస మెదురైనది. రసాత్మకమైన ఒక్క వాక్యమైనను కావ్యమే గదా. ఈ రచనలన్నియు ఏల కావ్యములు కావని కొంద రనవచ్చును. అంత మోజుపడి అనుకొనదలచినచో అవి కావ్యములే యని అనుకొనవచ్చును గాని ఖండకావ్యములని పరిధి తగ్గించుకొన నేల! ఈ భావకవితలలో చదివిన పిదప ఎంతకాలమైనను ఎదను వదలని ఖండికలెన్నో యున్నవి. కాని మొత్తముమీద భావకవిత నంతను పరిశీలించుట పొగ మంచును ప్రోగుచేయుటే.

మన వాఙ్మయమున కలిగిన క్రమపరిణతిని మనసులో నుంచుకొని ప్రాచీన సాహితీ పఠన సంస్కారమునకు పూర్తిగా దూరము గాకున్నచో ఖండకావ్యపదమును – పరిమితార్థమునను, ఒక నిర్దిష్ట ప్రక్రియపట్లను

ప్రయోగించుట సమంజస మనిపించును. కవి ఒక సరసమైన కథనుండి మనోజ్ఞమైన సన్నివేశమును గ్రహించి, పాత్రచిత్రణను, భావమాధుర్యమును, భాషాలాలిత్యమును అందముగ పొందుపరచి రసవంతముగ తీర్చిదిద్దు అనతి విస్తృతమైనరచన ఖండకావ్యము.

ఖండకావ్యమున ఒకే సన్నివేశ ముండవలెను. ముందువెనుకల కథాభాగముల నీ సన్నివేశమునకు ముడిపెట్టరాదు. అసంపూర్ణమైన కథ యుండుటే ఖండకావ్య లక్షణము. స్వల్పమైన పరిధిలో రక్తిగట్టుటకు పేలవమైన సన్నివేశము ప్రయోజనకారి గాదు. అందుచేత కవి, రచనకు పట్టునిచ్చు సన్నివేశమునే పరిగ్రహించుట మంచిది. పరిధి స్వల్పమైనను పాత్రచిత్రణ యుండవలెను. పాత్రలసంఖ్య కావ్యమున పెరుగవచ్చును గాని ఖండకావ్యమున ఎక్కువ కారాదు. ఖండకావ్యమున రెండు మూడు పాత్రలకంటె ఎక్కువ చేర్చిన, చిన్న ఛాయాచిత్రమున చాలమందిని చూపి నట్లుండును. ఆకారములు అల్పములై ఆ పాత్రలకు న్యాయము జరుగదు. ఖండకావ్యమున కవి యొక పాత్ర కాకూడదు. కవి, పాఠకుని యెదుట పాత్రగా ప్రత్యక్షమగుటకంటె పాత్రల వెనుక ప్రచ్ఛన్నుడై యుండుట మంచిది. ఎప్పుడు కవి పాత్రగా ప్రత్యక్షమగునో అప్పుడు ఖండకావ్యము భావఖండికగ పరిణమించును. పాత్రలమధ్య స్వల్పములైనను సరసమైన సంభాషణ లుండవలెను. సంభాషణ పాత్రస్వభావ పరిపోషకము. ఒక్క పాత్రనే నిలిపి ఆ పాత్రను గూర్చి కవి సంభాషణ రూపముగ గాని ఆఖ్యానధోరణిలో గాని రచన సాగించినచో అది భావఖండిక యగునుగాని ఖండకావ్యము గాదు. జాషువాగారి భీష్ముడు, భారత వీరుడు, యుగంధర మంత్రి, ఆంధ్రభోజుడు మొదలగునవి అట్టి రచనలే.

ఆధునిక వాఙ్మయమందలి అన్ని ఖండకావ్యములను సమీక్షింప బూనుట యీ స్వల్ప పరిధిలో అసాధ్యమే గాక అనావశ్యకము. అందుచే

ఉదాహరణప్రాయముగ రెండు మూడు ఖండకావ్యముల సమీక్షించుటయే సందర్భ యోగ్యము.

కర్ణ ధుర్యోధనుల మైత్రి ప్రపంచప్రసిద్ధము. వారి మైత్రి మైత్రి లోనే ఒక మహోన్నత శిఖరము. అది ఎంతో ఉన్నతమని ఎవరికివారు మాటాడుకొనగలరేమొ గాని అది ఎంత ఉన్నతమో ఎదుటి వారికి చూపి చెప్పునపుడు ఇంచు మించు అందరు మాట లేనివారే. ఆ మహోన్నత మైత్రీ శిఖరమును సమగ్రముగ సహృదయులకు సాక్షాత్కరింపజేయు ఖండకావ్యము శీర్ణమేఖల. రచయిత డా. నండూరి రామకృష్ణాచార్య.

అది దుర్యోధనుని అంతఃపురము. సమయము అర్ధరాత్రి. అంతః పుర సోపానపరంపరాగ్రముల నెవ్వడో ఎకాయెకి ఎక్కుచున్నాడు. అత డెవ్వరో పారకు లెట్లు గుర్తించగలరు। ఇంతలో భానుమతీదేవి మందిర రత్నకవాట కాంతికిరణము అతని ముఖముమీద బడినది. ఆ వ్యక్తి అంగధరాతలేశ్వరుడు—కర్ణుడు. కర్ణుడు గడప కడ నిలిచి కవాటము దెరచి లోనికి చూచినాడు.

"మణిమయమైన సుందర తల్పము—మధ్య గజ భట వ్యూహ రచనతో గూడిన చదరంగము, ఆ చదరంగమునకొకవైపు చెలికత్తె— వేరొకవైపు భానుమతీదేవి"—ఇది కర్ణుడు గాంచిన దృశ్యము.

కర్ణుని జూచి ఆ కొంతలు తటాలున తల్పము దిగినారు. ప్రక్క నున్న బంగరుపీఠపై కర్ణుడు కూర్చున్న పిదప అంగనలు తిరిగి ఆట నారంభించినారు. సుక సేపాగి "ఎచ్చటి కేగినాడు ధరణీశ్వరుడ"ని కర్ణు డడిగినాడు. "ఎక్కడో పాదచారియై ఇప్పుడే వెడలినారు. నేనుగూడ ఎదురు చూచు చున్నా నన్నది" భానుమతీదేవి. "వెళ్ళి వచ్చెద నని"కర్ణుడు

లేచినాడు. అందుకు భానుమతీదేవి "మీరు వచ్చివెళ్ళుటను విన్నచో మీ మిత్రుడీ రాత్రి నిదురింపడు. వచ్చెగి వేళయయ్యె ఆగుడ"ని చెప్పినది. ఆ మాటకు కర్ణుడాగినాడు. ఆమె మరల ఆట నారంభించినది. చెలికత్తె ఆటను క్షణములో భానుమతి కట్టింప సమకట్టినది. ఆటలోని ఆ పట్టు చూచుచు పరవశుడై కర్ణుడు సువర్ణపీఠినుండి లేచి శయ్య చెంతకు చేరినాడు. ఆటలో మునిగిపోయి మెల్లమెల్లగా తనకు తెలికయే చెలికత్తె ప్రక్కన కూర్చున్నాడు. వారణవారణమున రాణి ఆటనె కదలించి వైచినాడు. చెలికత్తె శయ్య దిగి ప్రక్క కొదిగి నిలిచినది.

ఇప్పుడా అంతఃపురములో అర్ధరాత్రివేళ ఒకే శయ్య మీద చేరి చందరంగమాడునది రాధేయుడు; రాజరాజు రాణి భానుమతీదేవి. తారకలు పులకరించి ఆ వింత దృశ్యమును వినువీధి నుండి తొంగి చూచిన వట. కర్ణుడు రాణి ఆటను కట్టింపబోయినాడు.

ఇంతలో గంభీర మందగమనముతో మేడ మెట్లెక్కివచ్చు భర్తను భానుమతి చూచినది. అప్పుడామెకు తానున్న పరిస్థితి తలపునకు వచ్చినది. వెంటనే ఆట నీడి తటాలున పాన్పు దిగబోయినది. తాను ఆట కట్టించుట నామె ఓర్చుకొనలేక తొలగి పోవుచున్నదని తలంచి, ఓటమి నొప్పుకొని నడువుమన్నట్లు—ఆటలో పరవశత జెందిన కర్ణుడు ఆమె కొంగు పట్టుకొన్నాడు. ఆమె రభసంబున కొంగు విదిల్చినది. కర్ణుని కరవేగమున కామె మేఖల తెగిపడినది. మణులు చెల్లాచెదరైనవి. ఇంతలో సుయోధనుడు వారి సమక్షమున నిలిచినాడు. ఇక కర్ణునిసితి,

కట్టెదుటను నున్న కౌరవాధీశుని
ప్రాణమిత్రుని మోము నరయలేక

హైమకాంచిని పీడి అందందు పడిపోవు
చెదిరిన మణు లేర చేయిరాక
స్తంభించి నిలిచిన సతి కురు పట్టమ
హిషి అవస్థ మది నూహింపలేక
ఏమి యెరుగకయె ఇంతలు సలిపిన
తన్ను గూర్చి తన కర్తమ్ము గాక

కనక తల్పము జారిన కర్ణు హృదయ
మందు విద్యుల్లతా రోచి అశనిపాత
మగ్ని పర్వత జృంభణ మబ్ధిఘోష
ధరణి కంపమ్ము లేకనై తాండవించె

కవి ఈ ప్రమాద పరిస్థితి నెట్లు పరిష్కరించునాయని పాఠకుడు గూడ ఇట ఉద్విగ్న మానసుడగును. మహాక్లిష్టమైన ఆ సమయమున మనోజ్ఞ మందహాసముతో మేఖలామణుల నేరి దోసిట పట్టి కర్ణుహృదయ మెరిగిన కౌరవేశ్వరుడు ముందున కడుగు వేయుచు "అగ్రహం బందిరొ రాణివారు క్షమకర్హుడు నా ప్రియమిత్రుడ"ని పలికినాడు. ఇట కర్ణునితోపాటు భానుమతీదేవిగూడ ఒక్క నిట్టూర్పు విడిచియుండును. వారితోపాటు పాఠకుడును ఒక్క ఊర్పు విడువకపోడు.

సన్నివేశ సౌందర్యము, నాటకీయత, పాత్రపోషణ, మానసిక చిత్రణ, సం[illegible]ణచారిమ మొదలగు మేలిగుణముల రాశి శీర్ణమేఖల. శీర్ణమేఖల శి[illegible]నమున పరాకాష్ఠ నొందిన ఖండకావ్యము.

పర[illegible]ర తపోభంగము భారతీయులకు చాల పరిచయమైన ఘట్టము. [illegible]చయమైన విషయమును మరల చెప్పి మెప్పించుట

మహాకష్టము. అంతేగాక ఆ సన్నివేశము మహాకవి కాళిదాసు చేతిలో సిద్ధిపొందినది. కవితాలోకమున అతని రచన గౌరీశంకరశిఖరమే, కాళిదాసు కవిత ముందు ఏ కవితయైన వెలవెలబోవునుగాని వెలుగునీయ జాలదు. ఈ అభిప్రాయమునకు అపవాదముగ నిలిచిన ఖండకావ్యము తపోభంగము. రచయిత కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి గారు.

మంచుమలమీదమహేశ్వరుడు ధ్యానసముద్రాముద్రితుడై యున్నాడు. ఆ మౌనిమణికి మందాకినీ మందమారుతములు మానససరోవరాంతర మధుకణాలు మోసికొనివచ్చి సేవలు చేసి పోవునట. పార్వతీదేవి ఆ మహాత్మునికి ముప్రొద్దు సపర్యలు సేయుచున్నది.

అమ్మనిరాజును గెల్వనెంచిన కాముడు కాంతాయుతుడై తుమ్మెద నారితో, చివురు తూణముతో, విరజాజి విల్లమ్ములతో, శుకిపిక బలమ్ములతో సమయము కొరకు నిరీక్షించుచున్నాడు. ఇంతలో పార్వతి ప్రవేశించినది. చిగురుచేతులు మొగిడ్చి శివుని యెదుట నిలిచినది. పూజోపహారములు తెచ్చితినని ప్రియమార పలికినది. పార్వతి ఆ పూజోపహారముల నందించుట, పరమేశ్వరుడు వానిని పరిగ్రహించుట సహృదయు డీ పద్యమున ప్రత్యక్షముగ పులకింప వచ్చును.

> అందము చిందిపోవు చెవి యందలి చెందొవ జారుచుండ "పూ
> లందు కొనుం"డటంచు సుమనోంజలి ముందుకు చాచి శైలరా
> ణ్ణందన వంగె— చెంగున సుమాస్త్రని చాపము వంగె-వంగె బా
> లేందుధరుండు కాన్కలు గ్రహింపగ ఉన్నమి[illegible] యుడై

ఇట హరుడు పార్వతి యిచ్చిన పూవు లందుకొన[illegible] [illegible]ట మరుడు మగువ అందించిన పూవుటమ్ము వింట సంధించినా[illegible] [illegible]రాత ఆ

సుమాస్త్రుడు చూపిన సాహసమును, సామర్థ్యమును ఈ తేటగీతి తెలుప గలదు.

తియ్యవిల్కాడు వింట సంధించి విడిచె
అక్షయమ్మైన సమ్మోహ నాశుగమ్ము;
గౌరి కడగంటి చూపుతో కలిసిపోయి
గ్రుచ్చుకొనె నది ముక్కంటి గుండెలోన

పరమేశ్వరుడు పులకరించినాడు. పార్వతీదేవి పాణితలము పట్టినాడు. వలపు తొలకరింప ఒక్క క్షణము ఆమె అధరమును వీక్షించినాడు. సర్వమంగళ "స్వామీ! యేమది!" యని సిగ్గు ముసుగువడ ముఖము వంచి ఒకింత వారించి నిలిచినది. ముక్కంటి వెంటనే మనసు నిగ్రహించుకొన్నాడు. చుట్టుప్రక్కల చూచినాడు. పూవుటీరము అతని చూపు పట్టినది. ఫాలనేత్రము ప్రజ్వరిల్లినది. "పాహి! పాహి! ప్రభో! ప్రభో! పాహి" యని అమరుల ఆర్తనాదములు ప్రతిధ్వనించినవి. ప్రసవశరుడు భగ్గు మన్నాడు.

భావమాధుర్యము, భాషాలాలిత్యము తటద్వయమ్ముగా తనరినట్టి మాధ్వీక ప్రవాహమే ఈ ఖండకావ్యము. ఆ పార్వతియేగాదు ఈ కవిత గూడ స్థాణుహృదయమును కదలింపగల దేమొ!

ఖండకావ్యములలో "దివ్యలోచనములు" తప్పక తెలుపదగినది. రచయిత తల్లా [illegible] శివశంకరశాస్త్రిగారు. ఇతర కవులలో ఖండకావ్య ప్రక్రియ చాల [illegible] యాదృచ్ఛికముగ అవతరించినదే. ఈ ప్రక్రియ వాఙ్మయమున [illegible]ర్య పరిణామమని యెంచి రచన కుపక్రమించిన వారు శ్రీ శివశంక

ధనుర్దాసు తన ప్రియకాంతకు గొడుగు పట్టి, ఆమె కనుదమ్ముల చూపు నిలిపి, ప్రక్కనున్న ప్రపంచము నెల్ల మరచి, పథము వెంట నడచుచున్నాడు. భగవద్రామానుజులు నదిలో అవగాహనాదిక మొనర్చి శిష్యసమేతుడై మఠమున కేగుచు మార్గ మధ్యమున ధనుర్దాసును చూచినాడు. ధనుర్దాసు గూడ రామానుజుని దర్శించి భక్తిభావ పరవశుడైనాడు. కావేరీజల స్పర్శతో ఊషరక్షేత్రములు సస్యశ్యామలములై శోభిల్లునట్లు మీ కరుణార్ద్ర దివ్యకటాక్షములు సోకి ఈ దాసుడు ధన్యుడయ్యె నని తల వంచినాడు. ఉదయార్క ప్రభారంజితంబై శ్రీమంతంబైన అంజనాచలము వలె మీ పాదపంకజరజము దాల్చిన నా శిరమునకు తమ సేవ చేయు భాగ్య మిమ్మని పులకించి అడిగినాడు.

భగవద్రామానుజులు భక్తిప్రవణమైన ధనుర్దాసు హృదయమును గనిపెట్టినాడు. ముఖమందును, మాట యందును, పవిత్రత ప్రకట మగుచున్నది గాని, ప్రేయసి చూపులలో చూపు నిలిపి, మమతలో బడి మైమరచి, ప్రక్కన పోవు ప్రజను గూడ లెక్కసేయక ప్రవర్తించుచున్నా వన్నాడు. ప్రేమ నడువీథిలో ప్రదర్శించు పదార్థము గాదని, నిండు మనమ్ములో నిగూఢ వృత్తితో నిలువవలసిన మధురభావమని మందలించి నాడు. అందులకు ధనుర్దాసు తనకు ప్రణయభావమును ప్రకటించు బుద్ధి లేదనియు, లజ్జను గోల్పోవ కోరిక లేదనియు, కామినికి తాను సపర్య సేయలేదనియు, పథికులను గాంచకుండుట పొగరుచే గాదనియు ప్రత్యుత్తర మిచ్చినాడు. మనస్సు హరించి, మధురమంజులకాంతితో, లక్ష్మీనిలయంబు లైన ప్రేయసి దివ్యలోచన ద్యుతులకు పరిచర్య చేయ [illegible] వశత బొంది బ్రదుకుచుంటిననియు, ఆ కన్నుల కమనీయకాంతు [illegible] ందు కిరణ ప్రసారమున వసివాడు నేమొ యని ఛత్రముపట్టి చ [illegible] పి సాగిపోవు చుంటిననియు విన్నవించు కొన్నాడు. అంత రామ [illegible] "ఈ కలికి

మనోజ్ఞ నేత్రముల కన్న మనోజ్ఞమయ్యె మహాద్యుతుల్ గొలిపెడి నేత్ర యుగ్మమునకున్ నిరతంబు సపర్య సేయుదే :" యని ప్రశ్నించినాడు. ధనుర్దాసు, ప్రేయసి కన్నుల కన్న అందమైన కన్ను లెచ్చటను కన్పించ లేదని, అట్టివి చూపినచో "నిక్కపు భక్తిభావమున నిత్యము దాస్యము చేయకుందునే" యని తన సౌందర్యారాధనాదిదృక్షను సవినయముగ తెలుపు కొన్నాడు. ప్రసంగము పెంచక భగవద్రామానుజులు ఆ భక్తుని వెంట నిడుకొని పోయి కావేరీ తీరమున కనుల పండువుగ వెలసి యున్న శ్రీరంగనాథుని దివ్య నేత్రముల దర్శింపజేసినాడు. ఆ లోచనముల దివ్య ద్యుతులు చూచి ధనుర్దాసు తన్మయుడైనాడు. "పరమ ప్రీతిని భృంగ మాసవ సుధా పానాభిలాషన్ దళత్సరసీజంబుల వ్రాలు గాని యితర క్ష్మాజంబులన్ జేరునే" యని పరవశత్వమున పలికి శ్రీరంగనాథ సేవకుడైనాడు.

ఇంత సరసమైన సన్నివేశమును స్వీకరించి చక్కగ చిత్రించుట జాతిరత్నమును చేతబట్టి సానలు దిద్దుటే. పరిష్కృతిసిద్ధమైన ఈ ప్రజ్ఞతో కవిత్వముననే గాక లోకమున గూడ జాతిరత్నములవంటి భావకవుల చేరదీసి సానలు దిద్దిన కులపతులు శ్రీ శాస్త్రిగారు, ధనుర్దాసు, రామానుజుల పాత్రలు ప్రశంసార్హముగ పోషింపబడినవి. ధనుర్దాసు నివురుగప్పిన నిప్పు. అది గుర్తించి ఒక్క యుక్తితో రమణీలోలుని రంగనాథ భక్తునిగ మార్చిన రామానుజుని మహానుభావము, లౌకికప్రజ్ఞ ఉదాత్తరమణీయము లుగ చిత్రింపబడినవి. ఆ రెండు పాత్రలందును సహృదయుడు కని ఆత్మీయతను గాంచగలడు.

ఆద్యు... ...గాతి జగత్తున కొందరు కవిధనుర్దా...
దిద్దిన సాహి... ...జులు శ్రీ శివశంకరులు.

తుమ్మల వారి ఆదర్శ వీరుడు, వేలూరి శివరామశాస్త్రిగారి సువర్ణ కమలము, ఏటుకూరి నరసయ్యగారి శౌర్యజ్యోతి మొదలగు రచన లన్నియు ఈ కోవకు చెందిన ఖండకావ్యములే.

ఆంధ్రమున ఖండకావ్యము అవశ్యపరిణామమని భావించినను ఆధునిక యుగమున ఆ ప్రక్రియ పుట్టుటలో ఆంగ్లవాఙ్మయ ప్రభావము లేకపోలేదు. ఆంగ్లమున ఈ ఖండకావ్యము వంటిది 'Story Poem'. పాశ్చాత్యభాషలో ఈ ప్రక్రియ బాగుగ వృద్ధిపొంది ప్రజల నెక్కువ ఆకర్షించినది. ఆంగ్లవాఙ్మయమందలి ఇతర ప్రక్రియలవలె ఈ ప్రక్రియ గూడ తన ప్రభావమును మన కవులపై ప్రసరించి యుండును. నాటకము నుండి ఏకాంకిక, పెద్దకథ నుండి కథానిక యేర్పడినట్లే మహాకావ్యము నుండి ఖండకావ్యము పుట్టుట యాంత్రికయుగ ప్రభావము. ప్రజాస్వామ్య యుగ ప్రాభవము పైకొన్న ఆధునిక యుగమునకు అనుగుణమైన వాఙ్మయ పరిణామమే.

☆